# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

ఇండియన్
కెమెరా
అమెరికాలో
వేల
లెక్కను
కొన్నారు!




# అజయ్ '127'

## ప్రఖ్యాత చిన్న కెమెరా

అజయ్ యొక్క ప్రత్యేక లక్షణములు : అందమైన బ్యాక్‌లైట్ కేసు • ప్రతి 127 ఫిల్ము రోలుకు 8 ఎక్స్‌పోజర్సు. • ప్రఖ్యాత అమెరికన్ ఆప్టికల్ కంపెనీ తయారు చేసిన F-15 ఫిక్స్డ్ ఫోకస్ గల మినిస్కస్ లెన్సు • పూల్‌ప్రూఫ్, సింగిల్ స్పీడ్ షట్టరు • ఫ్లాష్ సింక్రొనైజ్డ్ • హుడ్ గల ఐ-లెవెల్ రకపు వ్యూ-ఫైండరు.

PI.AJ.G.H TEL

రూ.24 మాత్రమే స్థానిక పన్నులు అదనము.
అజయ్ బహుమతి ప్యాక్ : అజయ్ '127' మరియు ఏస్ ఫ్లాష్‌గన్. రూ. 39/- స్థానిక పన్నులు అదనము.
వివరాలకు వ్రాయవలసిందిగా వర్తకులకు మనవి. పెద్ద ఫొటో వ్యాపారుల వద్ద దొరుకుతాయి. లేక
పటేల్ ఇండియా ప్రైవేట్ లి.,
బొంబాయి • ఢిల్లీ • కలకత్తా • మద్రాసు.

తప్పక చూడండి!

నరనారాయణుల
నెయ్యము + వియ్యము + కయ్యము
నభూతో నభవిష్యతి అన్నట్లుగా
నవరసభరితముగా సృష్టించిన
మహత్తర పౌరాణిక
చిత్రము




జయంతి
పిక్చర్స్ వారి

# శ్రీ కృష్ణార్జున యుద్ధము

నిర్మాత • దర్శకుడు • కె. వి. రెడ్డి B.Sc.,(HONS)

BAKTHA

వాహిని విడుదల

# పాఠకుల లేఖలు

## జనవరి 1963

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారు రచించిన "దక్షయజ్ఞం", "పార్వతీ కల్యాణం", "కుమారసంభవం" గేయ కథలు చాలా బాగున్నవి. చదువుతున్నంతసేపూ శరీరమంతయు పులకరించి నేత్రముల వెంబడి ఆనందాశ్రువులు రావటము సమంజసముగదా! "కుమారసంభవం" అయిపోయినందులకు చాలా చింతిస్తున్నాము. వెంటనే అతని గేయ కథ నొకదానిని ప్రచురింపమని మా ప్రార్థన.

—తనికెళ్ల వెంకటరమణశాస్త్రి,
మృత్యుంజయనగరం

చందమామా! నీ కథ లెంతో ఆకర్షనీయంగా ఉంటున్నాయి. ముచ్చటగా మురిపించే రామతీర్థ కథలు గూడా బాగుంటున్నాయి. "ప్రపంచ వింతలు" అనే శీర్షిక బాల ప్రపంచానికి ఎంతో సహకరిస్తున్నది.

పెద్దాడ పార్థసారథి, సిర్పూర్-కాఘజ్‌నగర్

"రాకాసిలోయ", "వ్యర్థప్రయాన", "మునలమ్మ యుక్తి", "రాజైన బానిసపిల్ల", కథలు చాల బాగున్నవి. ఆ రచయితలకు నా కృతజ్ఞతలు అందజేయగోర్తాను.

—బిహెచ్. మురళీబాబు, బందరు

"రాకాసిలోయ" చదవటానికి చాలా బాగున్నది. అది ఎప్పుడు ముగింపు చేస్తారోనని చాలా భయముగా వున్నదండి.

—మహమ్మద్ బేగంబీ, జీలకర్రగూడెం

ఈ నెల ముగిసిన "కుమార సంభవము" గేయ కథ కళా లలితములగు వడ్డాదివారి రమణీయ చిత్రములతో, మృదు మధురమైన ఉత్పలవారి శైలితో అత్యంత శోభాయ మానమై ఆనందము గొలిపినది.

—ముంగండ రామచంద్రరావు, లక్కవరం

ఉత్పల సత్యనారాయణాచార్యగారి తెనుగు రచనలోని స్వారస్యం కొంచెంకూడా తీసిపోకుండా కన్నడంలో వున్నందుకు విస్తుపోయాం. కన్నడ కవి మధ్వగిరి జలజనాభతనయగారికి మా వాళ్ళ అభినందనలు తెలుపండి.

—బి. నరసమ్మ, బెంగళూరు

"చందమామ"ను సుమారుగా రెండు సంవత్సరములనుండి శ్రద్ధగా చదువుతూ ఆనందించు తున్నాము. కథ లన్నియు ఎంతో బాగుంటున్నాయి. ముఖ్యంగా ముచ్చటైన రంగుల చిత్రములతో కూడిన సీరియల్ "రాకాసిలోయ", "రామాయణం" బాగుంటున్నవి. ప్రత్యేకంగా వ. పా. గారి చిత్రములు మమ్ములను ముగ్ధులను చేయుచున్నవి. తాతయ్య కథలు, గుండు భీమన్న కథలు యెంతో వినోదాన్ని కల్గిస్తున్నాయి. ఎస్. వి. సుబ్బారావు, కురాసియా కాలియరీ

మరలా గుండు భీమన్న వచ్చినందున ఇంకమీద గుండు భీమన్న వెళ్ళిపోయేదాకా మాలాంటి పాఠకులకు పండగే.

—ఎం. గురుమూర్తి, కొత్తగూడెం

"రాజైన బానిసపిల్ల" సీరియల్ అమోఘం.

—గుణ్ణం బ్రహ్మజీరావు, మెర్నిపాడు

గురువర్యా, బేతాళ కథలు నా హృదయమునకు ఎంతయొ సంతము గల్పించినవి. కాని పట్టు వదలని విక్రమార్కునివలె పట్టు విడువక రచించె ఆ మహాపురుషుడెవరో వారికి నా హృదయపూర్వక వందనములు అర్పించ గోరుచున్నాను.

—ఎ. శివరాజ్, కర్వెన

ఒక

సొగసైన

క్రొత్త డబ్బాలో

జె. బి.

సాల్టో

బిస్కట్లు




రుచిగా, ఎల్లప్పుడూ కరకర
లాడుతూ ఉండే జె. బి. సాల్టో
బిస్కట్లు యిప్పుడు సొగసైన
రంగులుగల 450 గ్రాముల
డబ్బాలలో ప్యాకుచేయబడినవి.
సాల్టో బిస్కట్లను తినండి మరియు
డబ్బాలను యింట్లో వాడుకోండి!

జె.బి.మంఘారామ్ అండ్ కంపెనీ

గ్వాలియర్



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

చీనా సేనలు దురాక్రమణ చేసినదాకా మన ప్రజలూ, ప్రభుత్వమూ శాంతిని గురించే హెచ్చుగా ఆలోచించారు. ఇతర దేశాల మాట ఏమైనా మన దేశానికి శత్రుభయం ఉండదనుకున్నారు. ఇప్పుడా భ్రమ తొలగిపోయింది. దేశరక్షణ దృఢతరం చెయ్యటానికి తగు చర్యలు ప్రభుత్వం తీసుకుంటున్నది. మనకు ఆయుధాలు కావాలి. మనం యోధులను తయారు చేసుకోవాలి.

ఈనాడు దేశంలో ఏర్పడిన పరిస్థితి ప్రభావం చేత "చందమామ" ప్రచురణలో కూడా కొంత వ్యయం పెరిగింది. ఈ కారణంగా మార్చి సంచిక నుంచి "చందమామ" వెల 60 న. పై. లకు పెంచ నిర్ణయించామని మనవిచేస్తున్నాము.

సంపుటి : 32 - జనవరి 1963 - సంచిక : 1



CHITRA



# భారత చరిత్ర




ఆసియాకు పశ్చిమాన ఉన్న అరేబియాలోని మక్కాలో 570 లో మహమ్మద్ ప్రవక్త జన్మించి ఇస్లాము మతాన్ని వ్యవస్థాపించాడు. ఈ మతం అక్కడి ప్రజలలో ఉత్తేజనం కలిగించింది. ప్రవక్త అనంతరం 632 నుంచి ఇస్లాము మతావలంబులకు ఖలీఫాలు నాయకత్వం వహించి ఆ మతాన్ని ఇరాను నుంచి స్పెయిను దాకా గల రాజ్యాలలో వ్యాపింప జేశారు.

అరబ్బులు ఆది నుంచి కూడా పశ్చిమ భారతం పైనా, వాయువ్య సరిహద్దు ప్రాంతం పైనా కన్ను వేసి ఉంచారు. 637 ప్రాంతంలోనే, రెండవ పులకేశి పరిపాలనా కాలంలో ఒక అరబ్బుసేన బొంబాయి సమీపాన గల థానాకు వచ్చింది. అనంతరం బ్రోచ్ మొదలైన ప్రాంతాలపై దాడులు జరిగాయి. మరికొద్ది సంవత్సరాలకు దక్షిణ అఫ్ఘానిస్తాను అరబ్బుల వశమయింది. తరవాత అరబ్బులు కాబూల్ ఏలే షా పై అనేక దాడులు చేశారు. ఈ షా, కనిష్కుడి సంతతి వాడట.

దక్షిణ అఫ్ఘానిస్తాను జయించిన అరబ్బులు బలుచిస్తాన్‌లో కొంత భాగాన్నీ, సింధు రాష్ట్రాన్నీకూడా జయించారు. ఇరాక్ గవర్నరైన అల్ హజ్జజ్ యొక్క అల్లుడు ముహమ్మద్ ఇబన్ కాసిమ్ అనేవాడు, దేశద్రోహులైన బౌద్ధుల, సామంతరాజుల సహకారంతో 712 లో సింధునదిని దాటి అనేక నగరాలు జయించాడు. సింధు దిగువ లోయ యావత్తూ అరబ్బుల వశ మయింది. అరబ్బుల పురోగమనాన్ని అరికట్టినవారు దక్షిణాన చాళుక్యులూ, తూర్పున ప్రతిహారులూ, ఉత్తరాన కార్కోటులూనూ.

ఇలా ఉండగా 962 లో అల్ప్తిగీన్ అనేవాడు ఘజ్నీ రాజ్యాన్ని వ్యవస్థాపించాడు. ఇతను మధ్య ఆసియా

## 16. మహమ్మదీయుల రాక



పాలకుల బానిస అయి ఉండి ఘజ్నీలో స్వతంత్ర రాజ్యం వ్యవస్థాపన చేసి 963లో చనిపోయాడు. 977 లో ఈ రాజ్యం ఇతని అల్లుడైన సబుక్తగీన్ ఆధిపత్యం కిందికి వచ్చింది. ఇతన్ని నిరోధించిన వాడు ఉదభాండపుర రాజు జయపాలుడు. 997 లో సబుక్తగీన్ చనిపోయి ప్రసిద్ధుడైన అతని కొడుకు మహ్మూద్, ఘజ్నీకి సుల్తానయాడు. 1001 లో జయపాలుడు మహ్మూద్ చేతిలో చిత్తుగా ఓడిపోయి అవమానం సహించలేక చితి మీద కాలిపోయాడు.

ఘజ్నీ మహ్మూద్ క్రమంగా పంజాబును జయించాడు, స్థానేశ్వరం జయించాడు. 1015 లో ఇతను కాశ్మీరు లోయను జయించటానికి చేసిన యత్నం ఫలించలేదు. 1018 లో ఇతను కన్యాకుబ్జాన్ని తుడిచి పెట్టి ప్రతిహార సామ్రాజ్యాన్ని తుద ముట్టించాడు. 1022, 1023 లో గ్వాలియర్, కాలింజర్ రాజ్యాలు అతనికి లొంగాయి. 1026 లో ఇతను కాఠియవాడ్ లోని సోమనాథ్ పై చేసిన దాడి ప్రసిద్ధమైనది. ప్రసిద్ధమైన ఈ హిందూ ఆలయం పతనమైన నాలుగేళ్ళకు మహ్మూద్ చనిపోయాడు. మహ్మూద్ ప్రపంచ యోద్ధలలో చేర్చదగిన వాడు. ఇతను భారతీయులతోనే



ఘజ్నీ మహ్మూద్ విజయస్తంభం

గాక శత్రువులైన తురుష్కులతో కూడా గొప్ప యుద్ధాలు చేసి గెలిచాడు. ఇతను సంస్కృతిని కూడా పోషించాడట. అయితే భారత చరిత్రకు సంబంధించినంత వరకు ఇతను దోపిడికి మాత్రమే ఖ్యాతి పొందాడు. ఇతను చేసిన యుద్ధాలు ప్రధానంగా దోపిడి దాడులు. మత ప్రచారం కూడా అతని ముఖ్యాశయం కాదు. కాని ఇతని విజయాల వల్ల హిందూ రాజులలో ఆత్మ విశ్వాసం దెబ్బ తిన్నమాట నిజం. 1030లో ఘజ్నీ మహ్మూద్ పోయి 1192లో ఘూర్ ముహమ్మద్ వచ్చేదాకా హిందూ



రాజ్యాలపై చెప్పుకోదగిన దాడు లంతగా లేవు—ఒక అరబ్బు సేనాపతి వారాణసి నగరాన్ని కొల్లగొట్టాడు. అయితే ముస్లిము దాడుల భయం మాత్రం భారతీయులలో శాశ్వతంగా నిలిచిపోయింది.

అఫ్ఘానిస్తాన్ లోని పర్వతాల మధ్య ఘూర్ అనేది ఒక చిన్న రాజ్యం. తూర్పు పర్షియాకు చెందిన ఒక జాతివారు ఈ అనామకపు సామంత రాజ్యాన్ని పాలిస్తూ ఘజ్నీ సుల్తానుకు లోబడి ఉండేవారు. కాని మహ్మూద్ అనంతరం ఘజ్నీ సుల్తానులు బలహీనులవటం చేత ఘూర్ పాలకులు క్రమంగా బలవంతులై ఘజ్నీ సుల్తానులతో ఆధిక్యతకై పోటీ పడసాగారు. ఈ పోటీ మూలంగా ఘజ్నీ సుల్తానైన బహ్రామ్ షా అనేవాడు ఘూర్‌కు చెందిన ఇద్దరు అన్నదమ్ములను, కుతుబుద్దీన్ ముహమ్మద్, సైపుద్దీన్ అనేవారిని చంపించాడు. వీరిద్దరికీ సోదరుడైన అలాఉద్దీన్ హుసేన్ అనేవాడు ఘజ్నీపై భయంకరంగా పగ తీర్చుకున్నాడు. అతను ఘజ్నీ నగరాన్ని కొల్ల గొట్టటమేగాక ఏడు రోజులపాటు ఆ నగరాన్ని పరశురామ ప్రీతి చేసి "ప్రపంచ దాహకుడు" అనే బిరుదు కూడా సంపాదించుకున్నాడు. బహ్రామ్ కొడుకు ఖుస్రవ్ అనే వాడు పంజాబుకు పారిపోయాడు. తరవాత పదేళ్లపాటు ఘజ్నీనగరం ఘుజ్ జాతి తుర్క్‌మానుల అధీనంలో ఉండి 1173లో ఘూర్ పాలకుల అధీనమయింది.

"ప్రపంచదాహకుడి" కొడుకు తుర్క్‌మానుల చేతిలో చనిపోయాడు. కాని అతని దాయాది ఘియాసుద్దీన్ మహమ్మద్ 1173 లో తుర్క్‌మానులను ఘజ్నీ నుంచి పారదోలి, ఘజ్నీ రాష్ట్రానికి తన తమ్ముణ్ణి పాలకుడుగా ఏర్పాటు చేశాడు. ఈ తమ్ముడే ఘూర్ ముహమ్మద్. అన్న కింద సైనికోద్యోగిగా ఉంటూండగానే ఇతను ఇండియాపై దండయాత్రలు సాగించాడు.






# దాస్య విముక్తి

ప్రథమాశ్వాసము :

కశ్యపు డొనరించు పుత్ర
కామేష్టికి వచ్చినారు
వాలఖిల్య మహామునులు,
వారలతో ఇంద్రాదులు.

పరమ ఋషులు వేద మంత్ర
పఠనం బొనరించుచుండ
అగ్నికుండమున కశ్యపు
డాహుతు లర్పించుచుండె.

కశ్యపునికి ప్రక్కననే
కద్రూ వినతాది సతులు
కోరిక లీరిక లెత్తగ
కూర్చొని చూడదొడంగిరి.

జన్నమునకు సరిపోయెడు
సమిధలు, పువ్వులు లేవని
తెచ్చుటకై వాలఖిల్య
దేవేంద్రాదులు వెడలిరి.

ఎండినట్టి రావి పుల్ల
లేఱి పెద్ద మోపు కట్టి,
నెత్తికెత్తికొని ఇంద్రుడు
నిక్కుచు అరుదేరినాడు.

వాలఖిల్య మునులు కూడ
పూలు గోసి మూట గట్టి,
మోయలేక నడువలేక
ముక్కుచు అరుదేరినారు.

త్రోవలోన వారల గని
దేవేంద్రుడు పక పక నగి,
"పూలు గూడ మోయలేరు
బొట్టన వ్రేలంతవారు!

వాలఖిల్య మహామునులు
చాల గొప్ప బలవంతులు,"
అని ఇంద్రుడు ఎకసక్కెము
లాడి ముందు కేగినాడు.

ఉత్పల సత్యనారాయణాచార్య





ఆ మాటలు మునివరులకు
అమిత లజ్జ కలిగించెను;
అంత కంతకా హేళన
ఆగ్రహమును రగిలించెను.

వ్రతములచే శుష్కించిన
వారలమగు మ మ్మింద్రుడు
హేళన కావించినాడు,
ఎంత కండ కావర మది!

చులుకనమని దేవేంద్రుని
చూచి కన్ను లెఱ్ఱచేసి,
కానిమ్మని పెదవి గఱచి
కనలుచు ముని లేతెంచిరి.

వచ్చి రోషముతోడ ఇంద్రుని
వంక చూచుచు, వీర్యవంతము
లైన మంత్రము లుచ్చరించుచు,
ఆ మునీశులు వేల్వదొడగిరి.

హోమ ధూమముతోడ వారల
ఒడలు, వలువలు నల్లనయ్యెను;
జేవుఱించిన వారి కన్నులు
సెగలు గ్రక్కెడు నిప్పులయ్యెను!

"ఇంద్రు కంటెను నూఱు రెట్లులు
ఎక్కుడగు బలవంతు డొక్కడు
పుట్టి రెండవ ఇంద్రుడై, చే
పట్టు గావుత స్వర్గలోకము."

అనుచు వారలు వేల్చుచుండగ
విని బృహస్పతి వెఱపుతో చని,
కశ్యపుని కెఱిగించి ఇంద్రుని
కావు మీ వని కాళ్ళపై పడె.

"ఇంద్ర పదవికి ఎట్టి భంగము
ఎంత మాత్రము రాదు నమ్ముము;
బ్రహ్మ వాక్యం బిద్ది మీ కే
భయము వల"దని కశ్యపుం డనె.

అట్లు వాలఖిల్య మునులు
అగ్ని ముఖము చేసి వేల్వ,
యాగాగ్నుల నువ్వెత్తుగ
యజ్ఞ పురుషు డవతరించె.

కశ్యపునకు పాయసాన్న
కలశ మిచ్చి, అ పురుషుడు
ఱివ్వన మింటికి తారా
చువ్వ వోలె ఎగసి పోయె!

కశ్యపు డా పాయసమును
కద్రూ వినతా సతులకు
పంచి యిచ్చి, మీ కోర్కెలు
ఫలియించెడు నని పల్కెను.

అటు పిమ్మట తన భార్యల
నందఱ సంతోష పఱిచి,
కశ్యప ముని తప మొనర్ప
గంధమాదనమున కేగె.

కొన్నాళ్ళకు కద్రూ సతి
గ్రుడ్లను వేయిటిని పెట్టె;
రెండవదగు వినతా సతి
రెండే గ్రుడ్లను పెట్టెను.

మును కద్రువ గ్రుడ్లెల్లను
పెను పాములుగా మాఱెను;
వారలలో శేషుడనెడి
వాడు వేయి తలల వాడు!

ఎన్నాళ్ళకు గాని వినత
కన్నుల కఱ వెల్ల దీర
అండములం దొకటైనను
అవియలేదు—నవయలేదు.



పాల రాతి ప్రతిమల గ
ర్భాలలోని జ్యోతుల వలె
అండములం దుండి శిశువు
లవతరించి రాకుండిరి.

బహుకాలము చూచినయది,
అహరహమును వేచినయది,
వినతా సతి తన బిడ్డలు
వెలువడమికి ఏడ్చిన యది.

ఓర్పును కోల్పోయి వినత
ఒక నా డొక యండంబును
చిదిపినంత ఇల్లంతయు
చిందెను ఎఱ్ఱని కాంతులు!

అంతట వెలవెలబాఱుచు
అయమ వణకాడుచుండ,
అండమునందుండి యొక్క
అరుణమూర్తి బయలు వెడలి—

"అమ్మా! నీ యండంబును
అవియజేసి న న్నిట్టులు
అవిటివాని జేసినావు,
అవినీతి యొనర్చినావు.

ఓర్పులేక నీ విట్టులు
ఒనరించిన పాపమునకు
దాస్య మనుభవించుటయే
తగిన శిక్ష,"యని పల్కెను.

ఆ మాటలు విని నంతట
ఆమె కనుల నీళ్ళు తిరిగె—
తల్లి దుఃఖపడుట చూచి
తనయుని హృదయమ్ము కరగె.

"తల్లీ! దుఃఖింప వలదు;
దైవ వశముచేత నీకు
ఈ శాపము కలిగె నమ్మ!
ఇందుకు చింతింపకమ్మ!

కొన్నేండ్లకు నీ రెండవ
గ్రుడ్డు నుండి ఒక వీరుడు
వెలువడి, నీ దాస్య మతడు
తొలగజేసి సుఖపెట్టును.

అంతదాక నీ గ్రుడ్డును
అవియింపక కాపాడుము,"
అని వచించి ఆ అనూరు
డాకసమున కెగసిపోయె.

వినతయు కన్నీరులతో
వినువీధిని పరికించెను;
సూర్యుని సారథిగ తనదు
సుతు డుండుట గమనించెను. (సశేషం)






## 19

[ కేశవుణ్ణీ, జయమల్లునూ బానిసలుగా కొన్న వర్తకులపై నరమాంస భక్షకులు వచ్చి పడ్డారు. ఆ గందరగోళంలో కేశవుడూ, జయమల్లూ నదిలోకి దూకి ఒక లంక చేరారు. అక్కడ వున్న కొన్ని గుడిశెలను వాళ్లు సమీపిస్తుండగా, ఒక గుడిశెలోంచి, 'జ్యేష్ఠు డెక్కడ? కనిష్ఠు డెక్కడ?' అని ప్రశ్నించుతున్న కంఠధ్వని వినిపించింది. తరవాత—]

కేశవుడికీ, జయమల్లుకూ ఓ తృటికాలం ఏం చేసేందుకూ పాలుపోలేదు. "ఆ కంఠ ధ్వని బ్రహ్మదండి మాంత్రికుడిది! నా తండ్రిని వాడు హింసిస్తున్నాడు," అనుకున్నాడు కేశవుడు. "ఆ ప్రశ్నించే గొంతు నరభక్షకుల నాయకుడైన చండమండూకుడిది! గుడిశెలో వాడి అనుచరులు ఎంత మంది వున్నారో తెలియదు. ఇప్పుడేమిటి కర్తవ్యం?" అనుకున్నాడు జయమల్లు.

ఇలా ఆలోచిస్తూ కేశవుడూ, జయమల్లూ అప్పుడే చలనం వచ్చిన వాళ్లలా చప్పున ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. మాటలూ, సౌంజ్ఞలూ లేకుండానే ఆ క్షణంలో చేయవలసిందేమిటో యిద్దరికీ తెలిసిపోయింది.

జయమల్లు నిశ్శబ్దంగా వంగి, గుడిశె పక్కన వున్న ఒక ఈటెను చేతికి తీసుకున్నాడు. తరవాత కేశవుడి భుజం మీద చేయివేసి చెవిలో మెల్లిగా, "గుడిశెలో వున్న



శత్రువు లెందరో ముందు తెలుసుకోవాలి," అంటూ గుడిసెకు అల్లివున్న కొబ్బరి ఆకులలో నుంచి ఈటెను నింపాదిగా లోపలికి గుచ్చాడు.

కేశవుడు, జయమల్లు చేసిన కంతలో నుంచి లోపలికి తొంగి చూశాడు. గుడిసె అంతా చీకటి మయంగా వున్నది. ఒక మూల వెలుగుతున్న కాగడా వెలుగులో మసకమసకగా ఇద్దరు ముగ్గురు మనుషులు కనిపిస్తున్నారు. వాళ్ళల్లో ఒకడు మెడలో మానవ కంకాళాలను పూసలుగా ధరించి వున్నాడు. మరొకడు కూడా దాదాపు అలాగే వున్నాడు. వాడికి మెడలో ఎలాంటి అలం కారాలూ లేవు. వాళ్ళకు ఒకపక్కగా ఒక యువకుడు పెడరెక్కలు విరిచి కట్టబడి వున్నాడు. అతణ్ణి కంకాళాలు ధరించి వున్నవాడు ప్రశ్నిస్తున్నాడు.

"నాకు సర్వం తెలుసు, అంతా తెలుసు! నా నుంచి నువ్వు ప్రాణాలతో పారిపోలేవు. ముసలివాడి గొడవ నాకవసరం లేదు. నాక్కావలసింది, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ. చెప్పు, ఊఁ వాళ్ళెక్కడ?" అని కంకాళాలు ధరించిన వాడు భీకరంగా అరిచాడు.

అంత ప్రమాద పరిస్థితిలోకూడా కేశవుడికి ఎంతో ఆనందం కలిగింది. ఈ దుర్మార్గు లెవరోగాని, వాళ్ళకు చిక్కినవాడు మాత్రం తన తండ్రి కాదు. పైగా, గుడిసెలో వున్న వాళ్ళిద్దరు; వాళ్ళను హతమార్చి, వాళ్ళకు బందీ అయినవాణ్ణి విడిపించటం పెద్ద సమస్య కాదు.

కేశవుడు యిలా అనుకుని, జయమల్లు కేసి తిరిగి, "మల్లా, మనం లోపలికి జొరబడదాం. శత్రువు లిద్దరే," అన్నాడు.

జయమల్లు తొందర పడవద్దని కేశవుణ్ణి వారించి, కంతలో నుంచి గుడిసెలోకి చూశాడు. చేతులు విరిచి కట్టబడిన వ్యక్తి, కోయనాయకుడు గడేజంగ్ అనుచరుడన్న అనుమానం అతడికి కలిగింది. అంతలో

బంధితుణ్ణి ప్రశ్నిస్తున్నవాడు లేచి నిలబడి, పళ్ళు కొరుకుతూ, "వీడిని ఎంత హింసించినా నిజం చెప్పడు. ఆ మండూక కషాయం తాగించు. నిజం అదే బయట పడుతుంది," అన్నాడు.

"అలాగే చేస్తాను, చండమండూకేశ్వరా," అంటూ మండూకుడి అనుచరుడు లేచి వెళ్ళి, గుడిశెలో ఒక మూల నుంచి ఒక పాత్ర తెచ్చి, దానిని అక్కడ వున్న మిడిగుడ్ల కొయ్యబొమ్మల ముందు మూడుసార్లు తిప్పి, పాత్రను బంధితుడి నోటిముందు పెడుతూ, "ఇది నిజం చెప్పించే కషాయం, తాగు," అంటూ అతడి నోటిలో బలవంతంగా పోశాడు.

"వీడు నరభక్షకుల నాయకుడైన చండమండూకుడు, తెలిసిందా? వాడిప్పుడు బంధితుడికి నిజం పలికించే కషాయమేదో యిప్పించాడు. తొందర ఎందుకు? ఏం జరుగుతుందో చూద్దాం. ఆ తరవాత వాణ్ణీ, వాడి సేవకుణ్ణీ యమపురికి పంపుదాం," అన్నాడు జయమల్లు.

ఇంతలో మండూక కషాయం తాగినవాడు, పెద్దగా రెండుసార్లు దగ్గి, ఒకటి రెండుసార్లు మత్తెక్కిన వాడిలా అటూ యిటూ ఊగిసలాడి, "వాళ్ళిద్దరూ...



జ్యేష్ఠుడూ...కనిష్ఠుడూ...వున్నారు... యిక్కడే..."

అతడు మాట ముగించే లోపలే జయమల్లు కంత దగ్గిర నుంచి యివతలికి ఎగిరి గంతేసి, "కేశవా, ప్రమాదం! అది నిజంగా సత్యం చెప్పించే కషాయమే! ఆ తాగినవాడు మనం యిక్కడ వున్నట్టు చెప్పేస్తున్నాడు. మనం వెంటనే గుడిశెలో జొరబడి ఆ దుర్మార్గుల్ని చంపటం తప్ప మరి మార్గం లేదు," అంటూ గుడిశె ద్వారానికేసి పరిగెత్తాడు. బయట అడుగుల చప్పుడు వింటూనే చండమండూకుడు అదిరిపడ్డాడు. "ఎవరో శత్రువులు, శత్రువులు!" అంటూ



అరిచాడు. అతడి అనుచరుడు ఒక ఈటె తీసుకుని ద్వారంకేసి పరిగెత్తుతూ, "మండూకేశ్వరా, మీరు మాయంకండి!" అని కేక పెట్టాడు.

కేశవుడూ, జయమల్లూ గుడిశె ద్వారానికి అడ్డంగా వున్న తడికెను ఒక్క తన్ను తన్ని లోపలకు దూకారు. వాళ్ళను ఎదిరించ చూచిన, మండూకుడి అనుచరుణ్ణి కేశవుడు తన కత్తిపిడితో తల మీద ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బకు వాడు అబ్బా అంటూ కింద పడిపోయాడు.

గుడిశెలోకి ప్రవేశించిన కేశవుడికీ, జయమల్లుకూ కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. చేతులు విరిచికట్టబడి వున్నవాడు, జయమల్లు ఊహించినట్టు గడేజంగ్ అనుచరుడే. కాని, చండమండూకుడి జాడలేదు.

జయమల్లు, గడేజంగ్ అనుచరుడి కట్లు విప్పి అతణ్ణి గుడిశెలో వున్న ఒక బాదుకు ఆనించి కూచోబెట్టాడు. అతడింకా మత్తుతో అటూ యిటూ వూగుతున్నాడు. జయమల్లు అతడి తల మీద యింత నీరు కుమ్మరించి, భుజాలు పట్టుకుని వూపుతూ, "నువ్వు గడేజంగ్ అనుచరుడివే గదా? మేమిద్దరం స్నేహితులం. మనమంతా జలపాతంలో నుంచి నదిలోకి దూకి కపిలపుర రాజ్యం చేరాం. అక్కడ బానిస వర్తకుడి భటులకు చిక్కకుండా నువ్వూ, నీతోటివాడూ, గురు మౌనానందుడూ ఎటో పారిపోయారు. తరవాత ఏం జరిగింది?" అని గుక్క తిప్పుకోకుండా ప్రశ్నల వర్షం కురిపించాడు.

జయమల్లు ప్రశ్నకు కోయయువకుడు కళ్ళు తెరిచి అతడి కేసీ, కేశవుడి కేసీ చూడటం మాత్రం చేయగలిగాడు. అతడి ముఖంలో ఆశ్చర్యం, ఆనందం తొణికిసలాడింది. ఏదో చెప్పేందుకు ప్రయత్నించాడు, కాని మాటలు తడబడినై.

"మల్లూ, అతణ్ణి తొందర పెట్టకు. కాస్త విశ్రాంతి తీసుకోనీ. ఈ లోపల మనం

ఈ చండమండూకుడి జాడ తెలుసుకుందాం," అన్నాడు కేశవుడు.

కేశవు డిలా అనగానే మండూకుడి అనుచరుడు లేచి కూచుంటూ, "హాఁ, చండమండూకేశ్వరా! మాయమయావా? తిరిగీ నీ దర్శనం నూరేళ్ళ తరవాతనే గదా? అంత కాలం నువ్వు లేకుండా, నీ అనుచరులమైన మేము ఎలా జీవించటం!" అంటూ నెత్తీ నోరూ కొట్టుకో సాగాడు.

వాడి దుఃఖం, నూరేళ్ళ తరవాతనే గదా నీ దర్శనం అన్న మాటలూ విని కేశవుడుకి చాలా ఆశ్చర్యం కలిగింది.



కాని, జయమల్లు చిరునవ్వు నవ్వుతూ, మండూకుడి అనుచరుణ్ణి సమీపించి, వాడి జుట్టు పట్టుకు కుదుపుతూ, "ఓరి దొంగ వెధవా, నీ మాటలు మేము నమ్ముతామే అనుకున్నావా! ఎక్కడ? నీ నాయకుడెక్కడ? నిజం చెప్పక పోయావో నీ ప్రాణం తీస్తాను," అన్నాడు.

"ప్రాణమా? తీస్తావా? అంతకంటె నాక్కావలసిం దేమిటి? చండమండూకేశ్వరుడి కోసం చచ్చినవాళ్ళు నేరుగా స్వర్గానికే వెళ్ళిపోతారు. ఆ సంగతి లోకంలో తెలియని వాళ్ళెవరూ లేరే. నువ్వెంత అమాయకుడివి. నన్ను త్వరగా చంపెయ్యి!" అంటూ మండూకుడి అనుచరుడు పక్కన పడి వున్న ఈటెను అందుకుని దాన్ని జయమల్లుకు యివ్వబోయాడు.

ఈసారి కేశవుడితో పాటు జయమల్లు కూడా చాలా ఆశ్చర్యం పొందాడు. ఒకవేళ నిజంగానే చండమండూకుడు గుడిసెలో నుంచి మాయమయాడా? అన్న అనుమానం అతడికి కలిగింది. అంతలో గడేజంగ్ అనుచరుడు పెద్దగా దగ్గుతూ లేచి నిలబడి, "జ్యేష్ఠా, కనిష్ఠా, నన్ను గుర్తించారు గదా! సరే. మీరు ఆ దుర్మార్గుడి మాటలు నమ్మకండి. మండూకుడు ఈ గుడిసెలో వున్న రహస్య మార్గం కుండా పారి



పోయి వుంటాడని, నాకు గట్టి నమ్మకం వున్నది," అన్నాడు.

"రహస్యము...మార్గము...అహ్హహ్హ!" అంటూ మండూకుడి అనుచరుడు గుర్రంలా సకిలించి, "చండమండూకేశ్వరుడికి రహస్య మార్గాలు కావాలా? ఆ మహనీయుడు నీటిలో ఉప్పులా కరిగిపోగలడు, గాలిలో పొగలా కలిసిపోగలడు, మట్టిలో సారంలా యింకి పోగలడు, ఆకాశంలో..."

"ఇక నోరు ముయ్యి వాచాలపు వెధవా!" అంటూ కోయయువకుడు ఒక్క దూకులో వచ్చి, మండూకుడి అనుచరుడి గొంతు పట్టుకుని, "చూస్తూంటే వీడి ఎత్తు, తమ నాయకుడు బాగా దూరం పారిపోయేందుకు మన చేత యిక్కడ జాగారం చేయించటంలా వుంది. మీరు గుడిశెలోని నేలంతా తొక్కి చూడండి. నేను వీడి కాళ్ళూ చేతులూ కట్టి, అరవకుండా నోట్లో గోనె సంచీ కుక్కుతాను," అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ గుడిశె అంతా కలయ తొక్కసాగారు. చూస్తూండగానే కోయయువకుడు తన పని ముగించుకుని, ఢిఙక ఢిఙక తై ఢిఙక అంటూ గుడిశెలో హనుమంతుడిలా కుప్పిగంతులు ప్రారంభించాడు. రెండు మూడు నిమిషాల కాలం ముగ్గురూ గుడిశె అంతా కలయ తొక్కారు. హఠాత్తుగా కోయయువకుడు కీచుమంటూ అరిచి, "రహస్య మార్గం!" అంటూ దభీమని కింద గోతిలోకి పడిపోయాడు.

కేశవుడూ, జయమల్లూ కోయయువకుడు పడిపోయిన గోతిలోకి తొంగి చూస్తూ, "నీ కేం దెబ్బలు తగలలేదు గదా? అరెరె, ఇక్కడ మెట్లుకూడా వున్నవే. మండూకుడు మాయమైంది, ఈ మెట్ల మీదినుంచి భూసొరంగంలో కన్న మాట!" అన్నారు.

కోయయువకుడు ఒంటికి పట్టిన మన్ను దులుపుకుని, తల పైకెత్తి, "ఆ దుర్మార్గుణ్ణి పైనుంచి కిందకు దొర్లించండి. తరవాత

మీరు కూడా మెట్లు దిగిరండి. మండూకు డిక్కడే దాక్కుని వుంటాడు," అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ కలిసి, మండూకుడి అనుచరుణ్ణి కాళ్ళు తల పట్టుకుని పై నుంచి గోతిలోకి వున్న మెట్లమీదుగా కిందకు దొర్లించి, తరవాత వాళ్ళుకూడా కిందకుదిగి, గోతిని, దాని అంచుకు వేళ్ళాడుతున్న చెక్క తలుపుతో ఎప్పటిలా మూసేశారు.

కోయయువకుడు అనుకున్నట్టు అది వట్టి భూసారంగం కాదు. అక్కడ విశాలమైన గదులూ, భీకరాకారంతో వున్న కొయ్య బొమ్మలూ, ఈటెలూ, కత్తులూ...ఇలాంటి సరంజామా చాలా వున్నది.

"పైనున్న గుడిసె మండూకు డాడే కపట నాటకంలో ఒక భాగం మాత్రమే. వాడి నిజమైన నివాసగృహం యిది. ఆ మూలనున్న కాగడాలు వెలిగించి అన్ని గదులూ వెతకండి," అన్నాడు జయమల్లు.

ఆ వెంటనే ముగ్గురూ కాగడాలు వెలిగించి, ఆ ప్రదేశమంతా గాలించసాగారు.

కేశవుడూ, జయమల్లూ, కోయయువకుడూ భూసారంగమంతా గాలిస్తుండగా, చండమండూకుడు, తన అనుచరు డొకడితో కలిసి, లంక మధ్య వున్న అడవి లోని ఒక పాడుపడిన బావి లోంచి పైకి వస్తూ, "ఇప్పటి కేదో బతికి బయటపడ్డాం. ఆ బ్రహ్మదండి మాంత్రికపు నీచుడు నన్నెంత మోసం చేశాడు! నన్ను ఎవరి కోసరం అయితే వెతకమన్నాడో, వాళ్ళను నా భవంతి దగ్గిరికే పంపి, నా ప్రాణాలు తీయించేయిందు ప్రయత్నించాడు. లోపల నేను ఆ కోయ కుంకకు మండూక కషాయం తాగించి, నిజం చెప్పిస్తూంటే; ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ గుడిసె కంతల్లో నుంచి ఇదంతా చూస్తున్నారన్నమాట! వాణ్ణి కర్రగుచ్చి, నిలువునా కాల్చుకు తింటాను," అంటూ పళ్ళు కొరుకుతున్నాడు. —(ఇంకా వుంది)






# వరప్రదానం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ప్రదర్శించే ఈ శ్రమతోనూ, దీక్షతోనూ ఎన్నో అద్భుత శక్తులు సంపాదించి, దేవదత్తుడి లాగా లోకోపకారం చేయవచ్చును గదా. ఎందు కిలా నీ శ్రమనూ, దీక్షనూ వ్యర్థం చేసుకుంటున్నావు? నీ కా దేవదత్తుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక ఊళ్ళో దేవదత్తుడనే ఒక శ్రీమంతుడుండే వాడు. దేహీ అని అడిగిన వాడి కెల్లా దానధర్మాలు చెయ్యటం ఆయనకు బాగా అలవాటై పోయింది. పేదసాదల మాట అటుంచి, జరుగుబాటు కలిగిన వాళ్ళు కూడా దేవదత్తుడి వద్ద దానాలు పట్టే వాళ్ళు; ప్రతి రోజూ దానధర్మాలు ఎంత

---

బేతాళ కథలు



ఎక్కువగా చేస్తే దేవదత్తుడికి అంత ఆనందంగా ఉండేది.

ఇలా ఎడాపెడా దానాలు చేస్తుంటే ఎంత డబ్బయినా తరిగిపోక తప్పదు. దేవదత్తుడి డబ్బంతా అయిపోయింది. ఇళ్ళూ, వాకిళ్ళూ, పొలాలూ, ఇతర ఆస్తులూ అమ్మేసి, అదంతా దానధర్మాల కింద ఖర్చుపెట్టేసి దేవదత్తుడు కటిక దరిద్రుడైపోయాడు. ఆయన తన భార్యా బిడ్డలతో ఒక పూరి గుడిసెలో కాపరం ఉంటూ తిండికి కూడా ఇబ్బంది పడసాగాడు. ఈ స్థితిలో కూడా ఎవరైనా తన వాకిట ఆకలితో నిలబడితే తన తిండి వాడికి పెట్టేసేవాడు.

ఇలా జీవించటం దేవదత్తుడికి రోత అనిపించింది. చేస్తే దానధర్మాలు చేస్తూ బతకాలి, లేకపోతే చనిపోవటమే మంచిదని అతనికి తోచింది. అందుచేత ఆయన తన భార్యతో, "నేను వెళ్ళి డబ్బు సంపాదించుకు వస్తాను. నీవు కూలినాలి చేసి అయినా సరే బిడ్డల కింత తిండిపెడుతూ ఉండు," అని చెప్పి, ఇంటి నుంచి బయలుదేరి పోయాడు.

అయితే ధనం ఎలా సంపాదించాలో దేవదత్తుడికి తెలియదు. అందుచేత అతను తిన్నగా అడవికి వెళ్ళి, ఒక చెట్టు కింద కూచుని తన జీవితం చాలించ నిశ్చయించాడు. చావు ఎలా వస్తుందో అతనికి తెలియదు. తాను ఆకలితో మాడి చావవచ్చు. లేదా ఏ క్రూరమృగమో తనని చంపి తినవచ్చు. ఏ రూపంలో వస్తుందో తెలియని చావు కోసం ఎదురుచూస్తూ దేవదత్తుడు చెట్టు కింద కూచున్నాడు.

ఇదంతా చెట్టు మీద ఉండిన ఒక యక్షుడు చూసి ఆశ్చర్యపడ్డాడు. దేవదత్తుణ్ణి చూస్తే తపస్సు చేసుకునేవాడిలాగా లేడు. మామూలు మనిషి అడవిలో చెట్టు కింద ఎందుకు తిష్ఠవేస్తాడూ? ఈ సంగతి తేల్చుకుందామని యక్షుడు చెట్టు దిగివచ్చి,

"ఎవరు నీవు? ఇక్కడ ఎందుకు కూచు న్నావు?" అని అడిగాడు.

దేవదత్తుడు యక్షుడితో తన కథ అంతా చెప్పి, "ఎంత మంది దారిద్ర్యమో పోగొట్ట టానికి నా జీవితం ధారపోసి నేనే దరిద్రుణ్ణి అయాను. ఇక నాకు జీవించాలని లేదు," అన్నాడు. యక్షుడు దేవదత్తుడి దానదీక్షను మెచ్చుకుని, అతని కొక పెట్టె ఇస్తూ, "ఈ పెట్టెను తీసుకువెళ్ళు. ఇందులో నీవు చెయ్యి పెట్టినప్పుడల్లా ధనం దొరుకుతుంది. ఆ ధనంతో దానధర్మాలు చేస్తూ, దారిద్ర్య బాధ లేకుండా నీ భార్యా బిడ్డలతో సుఖంగా ఉండు," అని మాయమయాడు.

ఏ దేవతో తనకీ మహిమ గల పెట్టె ఇచ్చినట్టు దేవదత్తుడు తెలుసుకుని, పర మానందభరితుడై ఇంటికి వెళ్ళాడు. పెట్టెలో చెయ్యి పెడితే అందులో ధనం ఉండేది. ఆ ధనంతో తన ఇంటికి కావలిసినవన్నీ కొని, ఎప్పటిలాగే దానధర్మాలు చేస్తూ, అస్తులూపాస్తులూ కొనే ఆలోచన తలపెట్టక, ఆ పూరి గుడిసెలోనే సుఖంగా కాపరం చేస్తున్నాడు.

ఆ వూళ్ళోనే సంకర్షణు డనే ముచ్చు వెధవ ఒకడున్నాడు. వాడు దేవదత్తుడి జీవితంలో కలిగిన మార్పులన్నీ గమనిస్తూనే ఉన్నాడు. కాని, తిండికి కూడా లేని నిరు





పేద అయిపోయిన దేవదత్తుడు ఎలా వెన కటిలాగా దానధర్మాలు చేయగలుగు తున్నాడో సంకర్షణుడికి అర్థం కాలేదు.

ఈ రహస్యం తెలుసుకుందామనే ఉద్దే శంతో వాడు దేవదత్తుడి ఇంటికి వెళ్ళి యాచించాడు.

దేవదత్తుడు ఒక విచిత్రమైన పెట్టెలో చెయ్యిపెట్టి పట్టెడు డబ్బులు తీసి వాటిని సంకర్షణుడి చేతిలో ఉంచాడు.

"అయ్యా, తమరు దానధర్మాల కింద తమ సర్వస్వమూ తెగనమ్మి ఖర్చుపెట్టే శారు గదా, ఈ స్థితిలో కూడా అడిగినవారి కెల్లా దానాలు ఎలా చెయ్యగలుగుతున్నారు? ఇది చాలా వింతగా ఉంది!" అన్నాడు సంకర్షనుడు.

"అంతా, దేవుడి దయ!" అని దేవ దత్తుడు చెప్పాడు.

సంకర్షణుడు దేవదత్తుడి ఇల్లంతా కలయజూశాడు. ఆ పూరి గుడిసెలో డబ్బు దాచిపెట్ట దగిన ఒక ఇనపపెట్టె లేదు, కొయ్యపెట్టె కూడా లేదు. దేవదత్తుడి రహస్యం ఆ వింత పెట్టెలోనే ఉంటుందని నిశ్చయించుకుని, ఒకనాటి రాత్రి యక్షు డిచ్చిన ఆ పెట్టెను కాస్తా దొంగతనంగా తీసుకుపోయాడు.

సంకర్షణుడి శ్రమ అంతా వ్యర్థ మయింది. ఎందుకంటే వాడు ఆ పెట్టెను ఇంటికి తీసుకుపోయి తెరిచిచూస్తే అందులో చిల్లిగవ్వ కూడా లేదు. చివరకు పొయిలో పెట్టి కాల్చటానికైనా కొయ్యపెట్టె కాదు. పెద్దరాయితో కొట్టినా అది సొట్ట కూడా పడలేదు. ప్రాణం విసిగి సంకర్షణుడు ఆ పెట్టెను అటక పైన పారేశాడు.

వాడికి దేవదత్తుడి పైన చాలా ఆగ్రహం కూడా వచ్చింది. ఎందుకంటే దేవదత్తుడు సంకర్షణు డడిగితే తన రహస్యం చెప్పక, "అంతా, దేవుడి దయ," అన్నాడు. ఈ రహస్యం తాను కనుక్కోలేకపోతే కనీసం

రాజుగారైనా కనుక్కోలేకపోతారా అనుకుని ఆ నీచుడు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహా రాజా, మన ఊళ్ళో దేవదత్తు డనేవా డున్నాడు. వాడు దానధర్మాలు చేసి తన సర్వస్వమూ పోగొట్టుకున్నాడు. వాడికి ఈ మధ్య ఏదో నిధినిక్షేపం దొరికినట్టున్నది. ఎందుకంటే వాడు మళ్ళీ వెనకటిలాగే అందరికీ ఎడాపెడా దానధర్మాలు చేస్తు న్నాడు. రాజ్యంలోని నిధినిక్షేపాలు తమ సొత్తు గనక నేనీ సంగతి తమకు మనవి చేశాను," అన్నాడు.

ఇది వినగానే రాజు మంత్రితో, "మీరు భటులను వెంటపెట్టుకు వెళ్ళి, ఆ దేవ దత్తుడి ఇల్లు సోదాచేసి నిధినిక్షేపాలేమన్నా ఉంటే వెంటపెట్టుకు రండి," అన్నాడు.

ఆ ప్రకారమే మంత్రి భటులతో సహా దేవదత్తుడి ఇంటికి వెళ్ళాడు. ఆ పూరి గుడిసె చూస్తూనే మంత్రికి దేవదత్తుడి దారిద్ర్యం అవగాహన అయింది. అయి నప్పటికీ అయన దేవదత్తుణ్ణి, "నీ ఇంట నిధినిక్షేపాలున్నవని తెలిసింది. అలాటి దేమైనా ఉంటే దాన్ని తక్షణం రాజుగారి పరం చెయ్యి," అన్నాడు.

"మహాప్రభో, నా దగ్గిర చిల్లిగవ్వ కూడా లేదు," అన్నాడు దేవదత్తుడు.



"అంత పేదవాడివి ధారాళంగా దాన ధర్మాలు ఎలా చేస్తున్నావు?" అని మంత్రి అడిగాడు.

"ఒక యక్షుడు నా దానకాంక్ష తెలుసు కుని, నా పైన అనుగ్రహించి నా కొక పెట్టె ఇచ్చాడు. అందులో నేను చెయ్యి పెట్టినప్పుడల్లా డబ్బు చిక్కుతుంది. ఆ డబ్బే దానధర్మాలకు వినియోగిస్తున్నాను. ఆ పెట్టెను కాస్తా నిన్న రాత్రి ఎవరో ఎత్తుకుపోయారు. ఇవాళ నేను ఎవరికి కూడా చిల్లిగవ్వ దానం చేసే స్థితిలో లేను. నా కెంతో బాధగా ఉన్నది," అని దేవ దత్తుడు మంత్రికి చెప్పాడు.

దేవదత్తుడు నిజమే చెబుతున్నాడని మంత్రికి తోచింది. అంతేకాదు—దేవదత్తుడి పెట్టెను దొంగిలించిన వాడు సంకర్షణుడే అయి ఉంటాడని కూడా ఆయన ఊహించాడు. అందుచేత ఆయన భటులతో సంకర్షణుడి ఇంటికి వెళ్ళి, ఇల్లంతా శోధించగా అటక పైన పెట్టె దొరికింది.

మంత్రి నివలదీసి అడిగిన మీదట సంకర్షణుడు తాను పెట్టెను దొంగిలించిన మాట నిజమేనని ఒప్పుకున్నాడు, కాని అందులో ఏమీ లేదనీ, దేవదత్తుడు తన ధనాన్ని ఇంకెక్కడో దాచాడనీ అన్నాడు. రహస్యంగా మంత్రి ఆ పెట్టెను తీసుకుని, సంకర్షణుణ్ణి బంధించమని తన భటులతో చెప్పి, వాణ్ణి తన వెంట రాజుగారి వద్దకు తీసుకుపోయాడు. మంత్రి చెప్పినదంతా విని రాజుగారు దేవదత్తుడి కోసం మనుషులను పంపాడు. దేవదత్తుడు వచ్చాడు. తన పెట్టెను గుర్తించాడు.

"ఇది అపూర్వమైన పెట్టె అని విని మేమే దీన్ని తెప్పించాం. ఇందులో విశేషం ఏమీలేదే. దీన్ని నీవు ఏ విధంగా ఉపయోగపరుస్తున్నావు?" అని రాజుగారు దేవదత్తుణ్ణి అడిగాడు.

దేవదత్తుడు ఆ పెట్టెను తీసుకుని, అందులో చెయ్యిపెట్టి, గుప్పెడేసి డబ్బులు



తీసి అక్కడ ఉన్న భటుల కందరికీ పంచిపెట్టాడు.

"మేము చెయ్యిపెడితే ఏమీ దొరకలేదే. మంత్రం ఏమైనా ఉన్నదా?" అని రాజు అడిగాడు.

"మంత్రం ఏమీలేదు, మహారాజా! నేను తప్ప మరెవరు చెయ్యిపెట్టినా ఇందులో ఏమీ దొరకదు," అన్నాడు దేవదత్తుడు.

రాజూ మంత్రీ ఏదో రహస్యంగా మాట్లాడుకున్నారు. తరవాత రాజుగారు దేవదత్తుడితో, "ఈ పెట్టె నిధినిక్షేపం కన్న కూడా ఎక్కువైనది. అందుచేత అది నీ అధీనంలో ఉండటానికి వీలులేదు. ఇది దివాణంలోనే ఉండాలి. నీవు తీస్తే తప్ప ఇందులో నుంచి డబ్బురాదు గనక నీవు రోజూ ఇక్కడికి వచ్చి, దివాణం ఖజానా నింపుతూ ఉండు. నీకు మంచి జీతం ఏర్పాటుచేస్తాం," అన్నాడు.

దేవదత్తుడు సరేననక చేసేదిలేదు. రాజభటులు కొన్ని వేల సంచులు మోసు కొచ్చి దేవదత్తుడి పక్కన పేర్చారు. పెట్టె నుంచి ధనం తీసి ఆ సంచులన్నీ నింప మన్నాడు రాజు. దేవదత్తుడు పెట్టెలో చెయ్యి పెట్టాడు కాని అందులో ఏమీలేదు; పెట్టె ఖాళీగా ఉంది! ఇలా దేవదత్తుడికి ఎన్నడూ జరగలేదు. అతను ఎన్నిసార్లు పెట్టెలో



చెయిపెట్టి చూశాడు. కాని పెట్టెలో అతని చేతికి ఏమీ చిక్కలేదు.

"దొంగవేషం వేస్తున్నావు? నిన్ను చిత్ర వధ చేయిస్తాను!" అని రాజు దేవదత్తుణ్ణి బెదిరించాడు.

కాని దేవదత్తుడికి అంతకన్న పెద్ద దిగులు పట్టుకున్నది. "ఈ పెట్టెలో నాకు డబ్బు దొరకకపోతే నేను దానధర్మాలు ఎలా చెయ్యగలను?" అని అతను విలపించాడు.

మంత్రి సూక్ష్మబుద్ధి గలవాడు. దేవదత్తుడిలో కపటం ఏమీలేదని గ్రహించి ఆయన రాజుతో దేవదత్తుణ్ణి క్షమించమనీ, ఆ పెట్టె అతనికే ఇచ్చి పంపెయ్యమనీ అన్నాడు. దేవదత్తుడు తన పెట్టెను తీసుకుని ఇంటికి పోయి అందులో చెయ్యి పెట్టేసరికి చేతినిండా ధనం దొరికింది. పెట్టె మహిమ తిరిగివచ్చినందుకు సంతోషపడి అతను తన జీవితమంతా దానధర్మాలలో సుఖంగా గడిపాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, యక్షుడి అనుగ్రహం వల్ల దేవదత్తుడికి ఆ పెట్టెలో నుంచి డబ్బు తీసేశక్తి లభించింది గదా, రాజుగారి ఖజానా నింపవలిసి వచ్చేటప్పటికి ఈ శక్తి ఏమయింది? ఈ ప్రశ్నకు జవాబు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వరాలు వేరు, శక్తులు వేరు. యక్షుడు దేవదత్తుడికి ఏ శక్తినీ ఇవ్వలేదు. దానధర్మాలు నిర్విఘ్నంగా చేసే వరం ఇచ్చాడు. అతనిలో ధనాన్ని సృష్టించే శక్తి ఉన్నదని భ్రమపడి రాజుగారు, ఆ శక్తి ద్వారా తన ఖజానా నింపుకుందా మనుకున్నాడు. కాని రాజుగారి ఖజానా నింపే వరం యక్షుడు దేవదత్తుడికివ్వలేదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# దేవతలు దిగి వచ్చారు

కృతయుగం గడిచి త్రేతాయుగం ఆరంభమైన సమయంలో అవిక్షిత్తు అనే వాడు గొప్ప రాజు. అతని కొడుకు మరుత్తు తండ్రిని మించిన ప్రఖ్యాతి గలవాడు. అతన్ని రెండవ విష్ణు అనేవారు. దేవేంద్రుడు కూడా మరుత్తును ఎందులోనూ మించలేక అసూయతో కుములుతూ ఉండేవాడు. ఇంద్రుడి పురోహితుడైన బృహస్పతి మరుత్తు వద్ద కూడా పౌరోహిత్యం చేస్తూ, యజ్ఞ యాగాదులు చేయిస్తూ ఉండేవాడు.

బృహస్పతి కూడా సామాన్యుడు కాడు. ఆయన అంగిరుడి కొడుకు. అంగిరుడికి సంవర్తు డనే మరొక చిన్న కొడుకుండేవాడు. తేజస్సులో బృహస్పతి ఎక్కువే అయినా తపశ్శక్తిలో సంవర్తుడిదే పై చెయ్యి. ఇది చూసి సహించలేక బృహస్పతి అతణ్ణి చాలా రకాల బాధలు పెట్టాడు. అన్న పెట్టే బాధలు సహించలేక సంవర్తుడు తన ఆస్తి అంతా వదిలేసి, దిగంబరుడై తపస్సు చేసుకోవటానికి వెళ్ళాడు. ఇది జరిగిన అనంతరమే దేవేంద్రుడు యుద్ధంలో రాక్షసులను జయించి, ఇంద్ర పదవి సంపాదించుకుని తనకు పురోహితుడుగా బృహస్పతిని పెట్టుకున్నాడు.

సమస్త భూమండలాన్నీ జయించి లోకాలన్నిటిలోనూ కీర్తి గడించుకున్న మరుత్తును చూసి ఓర్చలేక దేవేంద్రుడు ఒకనాడు దేవ సభకు బృహస్పతిని పిలిపించి, "నీవు మరుత్తుకు పురోహితుడివిగా ఉండటం నా కేమీ బాగా లేదు. నేను త్రిలోకాధిపతిని, ఇంద్రత్వం పొందినవాణ్ణి. ఆ మరుత్తు మానవమాత్రుడు, ఎప్పుడో చావవలసినవాడు. అలాటప్పుడు నీవు నాకూ అతనికీ కూడా పౌరోహిత్యం చెయ్యటం ఏమి సబబు? బాగుపడాలంటే నాకే పురోహితుడివిగా ఉండిపోయి, మరుత్తును వదులుకో.



లేదా, ఆ మరుత్తుకే పురోహితుడవుగా ఉండి నా పౌరోహిత్యం మానుకో!" అని గట్టిగా చెప్పేశాడు.

బృహస్పతి బెదిరిపోయి, "అదేం మాట? మిమ్మల్ని వదులుకుని మరుత్తుకు పౌరోహిత్యం చేస్తానా? మరుత్తునే వదులుకుంటాను! మీ రెక్కడ, అతనెక్కడ?" అని ప్రమాణాలు కూడా చేశాడు. ఇంద్రుడి దిగులు తీరిపోయింది.

ఇది జరిగినాక మరుత్తు బృహస్పతి వద్దకు వెళ్ళి, "అయ్యా, నేనొక యజ్ఞం చేస్తానని ఇదివరకే మీతో చెప్పి ఉన్నాను. ఇప్పుడా యజ్ఞం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. తమరు వచ్చి నా చేత ఆ యజ్ఞం చేయించండి. యజ్ఞ సంభారాలన్నీ సిద్ధంగా ఉన్నాయి," అన్నాడు.

"ఇక నేను నీకు పౌరోహిత్యం చెయ్యనులే. ఇంద్రుడు నన్ను తనకే పురోహితుడుగా ఉండమన్నాడు. నేనుకూడా సరే నన్నాను," అన్నాడు బృహస్పతి.

"తమరు నన్నిలా విడిచిపుచ్చటం భావ్యంకాదు. మా తండ్రిగారికి కూడా మీరే పురోహితులు. నాకు తమ మీద ఎంతో భక్తి గౌరవాలు!" అన్నాడు మరుత్తు.

బృహస్పతి నిర్మొహమాటంగా, "అదేమి మాట? అటు దేవతలకు పురోహితుడుగా ఉంటూ ఇటు మానవమాత్రుడికి ఎలా పౌరోహిత్యం చేస్తాను? ఇక నుంచీ నేను నీకు పురోహితుణ్ణి కానని చెప్పానుగా! నీ యిష్టం వచ్చిన వాణ్ణి మరెవణ్ణయినా పెట్టుకో. నేను నీ చేత యజ్ఞం చేయించేది లేదు," అన్నాడు.

మరుత్తు అవమానమూ, నిరాశా పొందినవాడై తిరిగి వస్తూండగా అతనికి దారిలో నారదుడు కనబడి, "ఏం, నాయనా? ఏమిటలా విచారంగా వస్తున్నావు? ఎక్కడినుంచి రావటం? ఏమిటి కథ? సంగతేమిటో చెప్పు. నేను తీర్చగల కష్టమైతే తీరుస్తాను," అన్నాడు.

స్నేహపూర్వకంగా నారదు డీ మాట అనే సరికి మరుత్తు ఆయునతో జరిగినదంతా చెప్పాడు. "నా గురువుగారు నన్ను విడిచి పుచ్చుటమేగాక అవమానం కూడా చేశాడు," అని మరుత్తు తన కథ ముగించాడు.

"బృహస్పతి చేయించకపోతే మునిగి పోయిందేమీ లేదు. ఈ బృహస్పతికి సంవర్తు డని తమ్ము డొకడున్నాడు. అద్భుత శక్తి సంపన్నుడు. ప్రస్తుతం దిగంబరుడై తిరుగు తున్నాడు. అతను నీ చేత యజ్ఞం చేయించ గలడు," అన్నాడు నారదుడు.

మరుత్తు ప్రాణాలు లేచి వచ్చినట్టయింది. అతను నారదుడితో, "మహాత్మా, మీరనే ఆ సంవర్తుడు ఎక్కడ ఉంటాడు? అతన్ని ఏ విధంగా ఆశ్రయించాలి? ఏ విధంగా ఆయన అనుగ్రహం సంపాదించాలి? ఆయన కూడా నన్ను తిరస్కరిస్తే నాకు మరి వేరే చావుండదు," అన్నాడు.

"రాజా, ఆ సంవర్తుడు ప్రస్తుతం వెర్రి వాడి వేషంతో తిరుగుతున్నాడు. ఇప్పుడు మహేశ్వరుణ్ణి సందర్శించటానికి కాశీ వచ్చి ఉంటాడు. నీవు కాశీకి వెళ్ళి నగరద్వారం వద్ద ఒక శవాన్ని పెట్టుకుని కూచో. సంవర్తుడు శవాన్ని చూడగానే వెనక్కు పోతాడు. నీవు అతన్ని వెంబడించి అతను ఎక్కడికి వెళ్ళినా



సరే నీవూ వెళ్ళు. ఒంటరిగా చూసి శరణు కోరు. నిన్నెవరు పంపారంటే నారదుడు పంపాడని చెప్పు. నే నెక్కడ ఉన్నానని అడిగితే తడువుకోకుండా అగ్నిలో ఉన్నా నని చెప్పు," అని నారదుడు మరుత్తుకు సలహా ఇచ్చాడు.

మరుత్తు నారదుడికి కృతజ్ఞత తెలుపు కుని కాశీకి వెళ్ళి, నగరద్వారం దగ్గిర ఒక శవాన్ని పెట్టుకుని కూచున్నాడు. కొంత సేపటికి సంవర్తుడు అటుగా వచ్చి, శవాన్ని చూస్తూనే గిరుక్కున తిరిగి వెళ్ళసాగాడు. ఆ మనిషే సంవర్తుడని గ్రహించి మరుత్తు ఆయన వెంట పడ్డాడు. ఇద్దరూ ఒక నిర్జన

ప్రదేశానికి చేరుకున్నాక సంవర్తుడు మరుత్తు మీద దుమ్మూ, మన్నూ కొట్టి, మీద ఊశాడు. మరుత్తు ఇదేమీ లక్ష్యం చెయ్యక ఆయనకు ఒక్క నమస్కారం చేసి మళ్ళీ వెంట నడవసాగాడు.

కొంత దూరం వెళ్ళి సంవర్తు డొక బ్రహ్మాండమైన మర్రి చెట్టు కింద అలుపు తీరటానికి కూచున్నాడు. తరవాత ఆయన మరుత్తుతో, "నే నెవరో నీ కెలా తెలిసింది? నేను ఫలానా చోట ఉంటానని నీ కెవరు చెప్పారు? నిజం చెబితే నీ కోరిక తీరుతుంది. అబద్ధ మాడావో నీ తల నూరు చెక్కలవుతుంది," అన్నాడు. మరుత్తు నారదుడు చెప్పమన్నట్టే చెప్పాడు. చివరకు, "స్వామీ, నాకు గురువుగా ఉండి తమరు నా చేత యజ్ఞం చేయించాలి!" అని తన కోరిక వెలిబుచ్చాడు

అంతా విని, "ఈ వికారాకారంతో ఉన్న నా చేత యజ్ఞం చేయించుకోవటం దేనికి? ప్రతిభావంతుడైన మా అన్న బృహస్పతి యజ్ఞాలు చేయించటంలో సాటిలేనివాడు. ఆయనను వేడుకో," అన్నాడు సంవర్తుడు.

ఆ మాటకు మరుత్తు బృహస్పతి అన్న మాటలు కూడా సంవర్తుడికి చెప్పాడు. సంవర్తు డంతా విని, "నా చేత యజ్ఞం చేయించుకోవటంలో గల కష్ట సుఖాలు



ఆలోచించుకో. బృహస్పతికీ, ఇంద్రుడికీ కూడా నాపై ఆగ్రహం కలుగుతుంది. అది అలా ఉంచి అక్షరాలా నేను చెప్పినట్టు నీవు చేయకపోయావో నేనే నిన్ను నాశనం చేస్తాను," అన్నాడు.

"స్వామీ, ఏ పరిస్థితిలోనూ మీరు చెప్పిన దానికి తల ఒగ్గుతాను," అని మరుత్తు ప్రమాణాలు చేశాడు.

"సరే అయితే నేను చెప్పేది విను. ఈ యజ్ఞంతో బాటు నీకు అంతులేని ధనం సమకూరేలాగ చేస్తాను. నాకు ధనంతో పని లేదు. దానాలూ అవసరంలేదు. బృహస్పతికీ, ఇంద్రుడికీ పరాభవం చెయ్యటమే నాకు కావాలి. నిన్ను ఇంద్రుడితో సమానుణ్ణిగా చేస్తాను," అని సంవర్తుడు మరుత్తుకు మాట ఇచ్చాడు.

శివుడుండే హిమాలయ పర్వతానికి పక్కగా ముంజవంత మనే పర్వత మున్నది. అక్కడ అంతులేని బంగారం ఉన్నది. మరుత్తు శివుడి అనుగ్రహం పొంది, అక్కడికి తన పరిచారకులను పంపితే వారు ఆ బంగారం తీసుకురాగలరని సంవర్తుడు సలహా ఇచ్చాడు. ఈ సలహా ప్రకారం మరుత్తు తన పరిచారకులను బంగారం తెమ్మని పంపి పెద్ద ఎత్తున యజ్ఞవిధికి ఉపక్రమించాడు.





ఈ వార్త దేవలోకంలో బృహస్పతికి తెలిసింది. తన తమ్ముడైన సంవర్తుడిక మహా ధనికుడౌతాడని గ్రహించి బృహస్పతి మనోవ్యాధితో మంచం పట్టాడు.

తన గురువైన బృహస్పతి అస్వస్థత గురించి విని దేవేంద్రుడు సపరివారంగా చూడ వచ్చి బృహస్పతితో, "ఇదేమిటి? నీవిలా పాలిపోయి శుష్కించి ఉన్నావు? ఇది దేహజనిత జాడ్యమా, మనో జాడ్యమా? నీ మనో వ్యాధికి కారకు లెవరో చెబితే వాళ్ళని తక్షణం వధిస్తాను," అన్నాడు.

"దేవేంద్రా, మరుత్తు చేత సంవర్తుడు యజ్ఞం చేయిస్తున్నాడని విని నాకు బెంగ పుట్టుకొచ్చింది. సంవర్తుడు నా శత్రువు. ఈ యజ్ఞం చేస్తే వాడు మహా ధనికుడై పోతాడు. ఈ యజ్ఞం జరగటం నా కిష్టం లేదు. ఇది ఆపటానికి నీకు శక్తి ఉంటే ఆపు!" అన్నాడు బృహస్పతి.

అప్పు డింద్రుడు అగ్నిని పిలిచి, "అగ్నీ, నీవు నా దూతవుగా మరుత్తు వద్దకు వెళ్ళి ఈ యజ్ఞం బృహస్పతి చేస్తాడనీ, ఆయన యజ్ఞం చేయిస్తే తనకు అమరత్వం వస్తుం దనీ చెప్పు," అని ఆజ్ఞాపించాడు.

అగ్ని వెళ్ళి ఇంద్రుడు చెప్పమన్న విధంగా మరుత్తుతో చెప్పాడు. అంతా విని మరుత్తు, "మహాత్మా, యాజకుడుగా నాకు సంవర్తుడే చాలు. అమరులైన దేవతలకు యాజకుడైన బృహస్పతి మర్త్యుడనైన నా చేత యజ్ఞం చేయించటం ఏమిటి? ఆయనకు ఒక్క నమస్కారం," అన్నాడు.

అగ్ని అంతటితో వదలక దేవేంద్రుడి స్నేహం మరుత్తుకు ఎంతో మంచిదనీ, బృహస్పతి గురుత్వంతో అన్ని లోకాలూ లభ్యమవుతాయనీ మరుత్తుకు ఆశలు పెట్ట యత్నించాడు.

సంవర్తుడు అగ్నికి అడ్డొచ్చి, "నీవు వచ్చిన పని అయిపోయింది. నీ బృహస్పతి యాజకత్వం మా కక్కర్లేదు. ఇక నీవు

వెళ్ళు. వెళ్ళకపోయావో నిన్ను నిలువునా దహించి బూడిద చేస్తాను," అని గర్జించాడు. అగ్ని బెదిరిపోయి దేవేంద్రుడి వద్దకు వెళ్ళి తన దౌత్యం ఫలించ లేదని చెప్పాడు. దేవేంద్రుడు అగ్నితో, "నీవు మరుత్తు వద్దకు మళ్ళీ వెళ్ళి, నా మాట వినకపోతే వజ్రాయుధంతో అతడి తల నరికేస్తానని చెప్పు," అన్నాడు.

అగ్ని వణుకుతూ, "నన్ను మళ్ళీ పంపకండి. వెళితే ఆ సంవర్తుడు నన్ను నిలువునా దహించి, పిడికెడు బూడిద చేస్తాడు," అన్నాడు.

దేవేంద్రుడు ఈ మాట నమ్మక, "అన్నిటినీ దహించి బూడిద చేసే శక్తి నీ ఒక్కడికే ఉంది. నిన్నెవ్వరు దహించి బూడిద చేస్తారు? ఇది నమ్మరాని మాట!" అన్నాడు.

"అదేం మాట? నీవు మూడు లోకాలకూ అధిపతివై ఉండగా వృత్రుడు నీకన్న శక్తివంతుడై నీ నుంచి స్వర్గాన్ని లాక్కోలేదా?" అన్నాడు అగ్ని.

"ఆ వృత్రుణ్ణి దోమను నలిపినట్టు నలపగలిగి ఉండిన్నీ ఏదో ఉపేక్ష చేశాను. నా దగ్గిర వజ్రాయుధం ఉండగా మానవుడు నన్ను ఎదిరిస్తాడా?" అని ఇంద్రుడు దంభాలు పలికాడు.



"అదీ చూశాం! వెనక చ్యవనుడిపై వజ్రాయుధం వేశావుగా! ఆ చ్యవనుడి శక్తి చేత నీ వజ్రాయుధమూ, నీ చెయ్యీకూడా స్తంభించి పోయాయి. అంతటితో పోనివ్వక చ్యవనుడు నీ మీదికి భయంకర రాక్షసుణ్ణి సృష్టించి పంపకం చేస్తే, వాణ్ణి చూడటానికే భయంవేసి కళ్ళు గట్టిగా మూసుకున్నావు! ఇదంతా ఎందుకు? ఆ సంవర్తుడి శక్తు లెలాటివో నాకు తెలుసు," అని అగ్ని ఇంద్రుడికి చక్కగా వాతలు పెట్టాడు.

అగ్ని పెడ తిరిగాడని గ్రహించి ఇంద్రుడు ధృతరాష్ట్రుడనే గంధర్వుణ్ణి తన దూతగా మరుత్తు వద్దకు పంపాడు. ధృతరాష్ట్రుడు

మరుత్తుతో, "రాజా, ఈ యజ్ఞానికి బృహస్ప తిని యాజకుడుగా పెట్టుకోకపోతే దేవేం ద్రుడు నీపై వజ్రాయుధం ప్రయోగించ గలడు. తరవాత నీ యిష్టం!" అన్నాడు.

మరుత్తు అతనితో, "నాకు సంవర్తుడే యాజకుడు. మిత్రద్రోహం బ్రహ్మహత్యను పోలినదని మీ దేవేంద్రుడికీ దేవతలకూ చెప్పు," అన్నాడు.

"అదుగో, ఆకాశంలో ఆ భయంకరమైన చప్పుడు వింటున్నావా, రాజా? ఇంద్రుడు నీపై వజ్రాయుధం వెయ్యటానికి సిద్ధంగా ఉన్నాడు. మరోసారి ఆలోచించుకో!" అన్నాడు ధృతరాష్ట్రుడు.

నిజంగానే యజ్ఞశాలలో ఉన్నవారికి ఆకాశం నుంచి భయంకర గర్జన వినిపించింది. అందరూ భయపడ్డారు. మరుత్తుకు కూడా మనస్సు వికలమైంది. ఆయన సంవర్తుడితో, "స్వామీ, నన్ని ఉపద్రవం నుంచి తమరే కాపాడాలి!" అన్నాడు.

సంవర్తుడు మరుత్తుతో, "నీకు వజ్రాయుధం భయం అవసరం లేదు. అంతే కాదు, ఈ యజ్ఞం ఎలా జరపమన్నా అలా నేను జరిపించగలను," అన్నాడు.

"అయితే ఆ ఇంద్రుడూ, ఇతర దేవతలూ ప్రత్యక్షంగా వచ్చి యజ్ఞ సదస్సులో పాల్గొని సోమం స్వీకరించేటట్టు చెయ్యండి," అని మరుత్తు కోరాడు.

"అందరూ ఇప్పుడే దిగి వస్తారు," అన్నాడు సంవర్తుడు. ఆయన అన్నట్టే దేవేంద్రుడు మొదలుగాగల దేవతలు స్వయంగా యజ్ఞశాలకు వచ్చేశారు. మరుత్తూ, సంవర్తుడూ వారికి తగిన రీతిగా స్వాగతం చెప్పి, ఆతిథ్యం ఇచ్చి, వారి చేత సోమపానం చేయించారు. పులి లాగా బయలుదేరిన ఇంద్రుడు సంవర్తుడి మహిమ చేత పిల్లిలాగా అయిపోవటమే గాక మరుత్తును దీవించి, యజ్ఞం పూర్తి అయినాక తిరిగి స్వర్గానికి వెళ్ళిపోయాడు.





# రాక్షసుడు

తన భర్తకు చదువు సంధ్యలు లేకపోవటం ఏమీ బాగా లేదనుకుని మహలక్ష్మి భీమన్న చేత అక్షరాభ్యాసం చేయించింది. జమీందారుగారి అల్లుడై ఉండి చదవటమూ, రాయటమూ చేతకాకపోవట మేమిటని భీమన్నకు కూడా అనిపించింది. అందుచేత అతను శ్రద్ధగా చదువుకుని పుస్తకాలు చదివే దశకు వచ్చాడు.

జమీందారుగారు కూడా చదువులో అల్లుడికి సహాయపడ్డాడు.

ఆయన భీమన్నతో, "మన జమీందారీ వ్యవహారాలు నువు కొంచెం కొంచెం తెలుసుకోవటం అవసరం. అందుచేత నేను చదివేది ప్రతిదీ నువు కూడా చదువుతూ ఉండు. అన్ని విషయాలూ క్రమంగా నీకే తెలుస్తాయి," అన్నాడు.

భీమన్నకు ఎన్ని ఉత్తరాలు చదివినా జమీందారీ వ్యవహారాలు తల కెక్కలేదు గాని, తన మామగారు చదివేదెల్లా తానూ చదవాలన్నది మాత్రం గట్టిగా అర్థమయింది.

జమీందారుగారు ప్రతి రాత్రీ రామాయణం చదివి, కళ్ళజోడు తీసి రామాయణం మీద పెట్టి, వెళ్ళి పడుకుని నిద్రపోయేవాడు. అందుచేత భీమన్న తాను కూడా అలాగే చెయ్యాలనుకున్నాడు.

రాత్రి అయి అందరూ పడుకునే సమయానికి భీమన్న పడుకో లేదు; మామగారు రామాయణం చదివి పడుకోబోయేదాకా వేచి ఉండి, "నేను కాస్సేపు చదువుకుని వస్తాను, నువు పడుకో," అని మహలక్ష్మితో చెప్పి, మామగారి కళ్ళజోడు తాను తగిలించుకుని రామాయణం చదవటానికి కూచున్నాడు.

జమీందారుగారిది చత్వారపు జోడు. ఆయన వయసు మళ్ళినవాడు కనక ఆ కళ్ళజోడు లేకపోతే చదవలేక పోయేవాడు.

భీమన్నకు చత్వారం లేకపోవటంవల్ల ఆ జోడు పెట్టుకుని చదవ నారంభిస్తే కళ్ళకు శ్రమ అయింది.

అలాగే శ్రమ పడుతూ భీమన్న కొంచెం సేపు చదివే సరికి కళ్ళు వాటంతట అవే మూసుకుపోయి కునుకు వచ్చేసింది. కాస్సేపు కునికి మళ్ళీ కళ్ళు తెరిచి భీమన్న మరి కొంచెం సేపు చదివి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. ఇలా కునికిపాట్లు పడుతూ భీమన్న రామాయణంలో రాముడు రాక్షసులను చంపే ఘట్టం చదవసాగాడు.

భీమన్న ఒకసారి ఇలాగే కునుకుతూ కళ్ళు తెరిచే సరికి ఎదురుగా ఒక నల్లని ఆకారం కనిపించింది.

ఆ వచ్చిన వాడొక దొంగ. ఇల్లంతా మాటుమణిగి ఉన్న సమయంలో జమీందారుగారింట దొంగతనం చేసే ఉద్దేశంతో వాడు నల్లటి బట్టలు వేసుకుని, ముఖానికీ చేతులకూ మసి పూసుకుని వచ్చాడు. కాని నిద్ర మత్తులో ఉన్న భీమన్నకు వాడు రామాయణంలోని రాక్షసుడులాగా కనిపించాడు. రాముడు రాక్షసులను అడిగినట్టే భీమన్న, "ఒరే, రాక్షసుడా? నీ పేరేమిటి? ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని గద్దించి అడిగాడు.

"అరవకు! నోరెత్తావంటే చంపేస్తా!" అంటూ దొంగ భీమన్నను సమీపించాడు.

భీమన్నకు రాక్షసుణ్ణి చూస్తున్న కొద్దీ ఆగ్రహం రెచ్చిపోయింది. అతను దొంగ కత్తి పట్టుకున్న చేతిని ఒక చేత గట్టిగా పట్టుకుని, రెండో చేత్తో వాడి పీక పట్టుకున్నాడు. దొంగ ఒక్క చావు కేక పెట్టి కింద పడిపోయాడు. ఆ అలికిడికి ఇంటో వాళ్ళంతా లేచి వచ్చారు. దొంగ దొరికిపోయాడు. వాడు పేరు మోసిన దొంగ కావటంచేత, వాణ్ణి పట్టుకున్నందుకు భీమన్న ఖ్యాతి చాలాదూరం పాకింది.

[ పై మాసం మరొక సంఘటన ]





# రాజైన బానిసపిల్ల

## 4

అక్కడ ముసలిదాని సహాయంతో తన ప్రియురాలున్న చోటు తెలుసుకుని కూడా తెలివి తక్కువగా నిద్రపోయిన అలీషార్ మర్నాడుదయం నిద్రలేచి తాను వీధిలో పడుకుని ఉన్నందుకు ఆశ్చర్యపోయాడు. తల తడివి చూసుకుంటే తలపాగా లేదు, అతని పై బట్టకూడా పోయింది ; ఆ రెంటినీ దొంగ కాజేశాడు.

అతను లేచి వెళ్ళి తాను చేసిన పొరపాటు ముసలిదానితో చెప్పి, జముర్రుద్ ఏమయిందో కనుక్కు రమ్మని ఆమెను పంపాడు. ఒక గంట అయాక ఆమె విచారంతో తిరిగి వచ్చి, "నాయనా, జముర్రుద్ మాయమయింది. ఆమె మళ్ళీ నీకు దొరుకుతుందని నా కేమీ నమ్మకం లేదు. నీ పొరపాటు చేతనే ఈ విపత్తు కలిగింది. నీ కింక సహాయ పడగలవాడు అల్లా ఒక్కడే," అన్నది.

ఈ మాటలు వినగానే అలీషార్ కళ్ళు చీకట్లు కమ్మాయి. అతను పెద్ద పెట్టున ఏడుస్తూ కొంతసేపటికి మూర్ఛపోయాడు. ముసలిదాని పరిచర్యల వల్ల అతనికి స్పృహ అయితే వచ్చింది కాని అతను మనోవ్యాధితో మంచం పట్టాడు. ఈ స్థితిలో అతనికి నిద్ర కూడా లేకుండా పోయింది. ముసలిది వెయ్యి కళ్ళతో అతన్ని కనిపెట్టి ఉండి ఉపచారాలు చెయ్యకపోతే అతను శీఘ్రమే మరణించ వలసినవాడే. అలాగే అతను ఒక ఏడాదిపాటు మంచంలో ఉండి తీసుకున్నాడు.

అలీషార్‌ను మామూలు మనిషిని చెయ్యటానికి వృద్ధురాలు అన్ని విధాలా

సి. మాధవరావు



ప్రయత్నించింది. అతనికి జముర్రుద్ దొరుకుతుందనే ఆశ పూర్తిగా లేకుండా పోవటం చేతనే కోలుకునే శక్తికూడా లేకుండా పోయింది. ఇది గ్రహించి వృద్ధు రాలు, "నాయనా, నువీ మంచంలో పడి ఉన్నంత కాలమూ నీకు నీ ప్రియురాలు కనిపించే మాట కల్ల. సరి అయిన ఆహారం తీసుకుని, బలం తెచ్చుకుని లేచి తిరిగితే, నానా దేశాలూ చూస్తే ఆమె నీకు దొరక వచ్చు," అని పదే పదే చెప్పింది.

ఈ విధంగా ముసలిది చెప్పగా చెప్పగా ఆమె మాటలు అతని చెవి కెక్కాయి. అతను లేచి ఆమె వెంట స్నానశాలకు వెళ్ళాడు. ఆమె అతని చేత చక్కగా స్నానం చేయించి, షర్బతులు తాగించి, కోడి మాంసం తినిపించింది. ఇలా ఒక నెలపాటు చేసిన మీదట అలీషార్‌కు ప్రయాణం చేసే పాటి శక్తి వచ్చింది.

అతను ముసలిదానికి వీడ్కోలు చెప్పి ప్రయాణిస్తూ కాలక్రమాన జముర్రుద్ పరి పాలించే నగరానికి వచ్చి చేరాడు.

ఇదే సమయానికి ఈ నగరంలో నాలుగో విందు జరిగింది. విందులో ఒక పక్క జముర్రుద్ సపరివారంగా కూచుని అందరినీ పరిశీలించసాగింది. పౌరులందరూ ఎప్పటి లాగే విందుకు వచ్చి కూచున్నారు, కాని మీగడహల్వా ఉన్నచోట ఎవరూ కూచో లేదు. దాని దుష్ప్రభావాన్ని వారు మూడు సార్లు ప్రత్యక్షంగా చూసి ఉన్నారు.

అలీషార్ అక్కడికి వచ్చాడు. అతనికి ఆ మీగడహల్వా ముందు మాత్రమే ఖాళీ కనిపించింది. అతను ఆ ఖాళీలో కూచున్నాడు. చుట్టుపక్కల వాళ్ళంతా అతని కేసి భయంతో చూడసాగారు.

అతను అక్కడ కూచుంటూండగానే జముర్రుద్ అతన్ని చూసి గుర్తించింది. వెంటనే ఆమె గుండె దడదడా కొట్టుకో సాగింది. తన కంగారు తన భృత్యులు

గమనించకుండా ఉండగలందులకు కొంచెం సేపు ఏమీ చెయ్యకుండా ఊరికే ఉండి పోయింది. అలీషార్ తన ముందున్న మీగడ హల్వా తినటం గమనించింది. అతను కడుపు నిండా తిన్నదాకా అతన్ని పిలిపించ గూడదని ఆమె నిశ్చయించుకున్నది.

ఈ యువకుడెవడో వచ్చి మీగడహల్వా ముందు కూచుని నిరాటంకంగా తనకు కావలిసినంతా తినటం అతని చుట్టూ కూచున్నవారికి ఆశ్చర్యం కలిగించింది. ఎందుకంటే అదివరకు దాన్ని నోట పెట్టు కున్నవారికి రెండో కబళం దక్క లేదు— ఈ లోపలనే రాజభటులు వచ్చి జరజరా లాక్కుపోయారు. ఆ తరవాత వారు ప్రాణాలే కోల్పోయారు. కాని ఈ యువకుడు ఏ అపాయమూ లేకుండా తనకు కావలిసిన దంతా తినేసి, తన భోజనం పూర్తి అయి నట్టు గుర్తుగా కళ్ళు మూసుకుని దైవ ప్రార్థన చేస్తూ నోరు అడించాడు.

అతని భోజనం అయిపోయిందని గ్రహించి జమ్రుద్ తన భటులను పిలిచి, "మీరు వెళ్ళి, ఆ మీగడహల్వా తినే యువకుణ్ణి మర్యాదగా పలకరించి, నాతో మాట్లాడటానికి ఒక్కసారి రమ్మని అడగండి!" అని చెప్పింది. రాజభటులు మీగడహల్వా తిన్న



యువకుడి కోసం రావటం చూసి ప్రజలు, "అయింది, వీడికి కూడా మూడింది!" అనుకున్నారు. అయితే వారు అను కున్నట్టుగా రాజభటులు అతని పైన పడి జరజరా ఈడ్చుకుపోవటానికి మారుగా, "మా రాజుగారు తమతో ఒక్కసారి మాట్లాడగోరుతున్నారు, వస్తారా?" అని మర్యాదగా అడిగారు.

"వారి ఆజ్ఞ!" అంటూ అలీషార్ లేచి వారి వెంట బయలుదేరాడు.

ఇది చూసి పౌరులు తలా ఒక విధంగా అనుకున్నారు. కొందరు, "వీడికి నూకలు చెల్లాయి," అన్నారు. మరికొందరు, "అలా



జరగక పోవచ్చు. వీడు ఆ హల్వా కడుపు నిండా తినేశాడు," అన్నారు. మరికొందరు, "వీణ్ణి రాజభటులు జరజరా ఈడ్చుకు పోవటం లేదు. వీడి కే ప్రమాదమూ రాదు—చూస్తూ ఉండండి!" అన్నారు.

అలీషార్ తన సమీపానికి వచ్చి నిలబడ గానే జముర్రుద్, మిగిలిన వాళ్ళను అడిగి నట్టుగానే, "యువకుడా, నీ పేరేమిటి? నీ వృత్తి ఏమిటి? ఈ నగరానికి ఎందుకు వచ్చావు?" అని అడిగింది.

"నా పేరు అలీషార్. నా తండ్రి ఖురాసాన్ దేశంలో వర్తకుడుగా ఉండే వాడు. నేనూ అదే వృత్తిలో ఉంటూ రోజులు కలిసిరాక ఆ వృత్తి మానేశాను. నాకు అత్యంత ప్రియురాలైన స్త్రీని పోగొట్టు కుని ఆమె కోసం వెతుకుతూ ఈ నగరానికి వచ్చాను. ఆమె కన్న నాకు వేరే ప్రపంచం లేకపోవటం చేత, ఆమె పోయిన క్షణం నుంచీ నాకు సమస్తమూ కలలాగా ఉంటున్నది," అంటూ అలీషార్ పట్టలేని దుఃఖంతో మూర్ఛపోయాడు.

అతని ముఖాన పన్నీరు చల్లమని భటు లకు చెప్పి జముర్రుద్ ఎప్పటిలాగే ఇసుకలో రాగి పుల్లతో గీతలు గీసి, వాటిని పరీక్షించి నట్టు అభినయించి, అందరికీ వినపడేలాగ అలీషార్‌తో, "నీవు చెప్పిన దానిలో అబద్ధ మేమీ లేదు. నీ ప్రియురాలు నీకు తప్పక దొరుకుతుందని కూడా నేను జోస్యం చెప్ప గలను," అన్నది.

విందు పూర్తి కాగానే జముర్రుద్ తన భటులతో, "ఇతన్ని స్నానశాలకు తీసుకు పోయి స్నానం చేయించి, దివాణం నుంచి కొత్త బట్టలు తీసి అతనికి తొడిగి, ఒక గుర్రాన్ని అతని కిచ్చి, బాగా చీకటి పడ్డ తరవాత అంతఃపురానికి తీసుకురండి," అని ఆజ్ఞాపించింది.

ఆమె రాజభవనానికి వెళ్ళి, ఎప్పుడు చీకటి పడుతుందా, ఎప్పుడు తన భర్త

వస్తాడా అని ఎదురు తెన్నులు కాస్తూ, క్షణ మొక యుగంగా భావిస్తూ, ముళ్ళమీద ఉన్నట్టు ఉండిపోయింది. సాయంకాల ప్రార్థనల సమయం దాటి పోగానే ఆమె తన రహస్య మందిరానికి వెళ్ళి, అక్కడికి అలీషార్‌ను ప్రవేశ పెట్టమని ఉత్తరు విచ్చింది. అతను తనను ఒక్కసారిగా గుర్తిస్తే ఆనందం పట్టలేక ప్రాణాలు వదులుతాడని భయపడి తన పైన వెలుగు పడకుండా క్రీనీడలో కూచున్నది.

ఎక్కడి నుంచో వచ్చిన ఈ యువకుడిపై తమ రాజు ఇంత శ్రద్ధ కనబరచటం చూసి రాజోద్యోగులు, "రేపీపాటికి ఈ యువకుడు ఏ మంత్రో, సేనానాయకుడో అయిపోతాడు," అని తమలోతాము చెప్పుకున్నారు.

అలీషార్ వచ్చి అభివందనం చేశాడు. జముర్రుద్ అతన్ని, "స్నానశాలకు వెళ్ళావా? సేద తీరిందా? స్నానం అనంతరం ఆకలి కలగలేదా?" అని ఏవో ప్రశ్నలతో పలకరించింది. అన్ని ప్రశ్నలకూ అలీషార్ "చిత్తం," అని జవాబిచ్చాడు.

తరవాత ఆమె అతని చేత భోజనం చేయించింది. భోజనానంతరం అతన్ని తన సమీపంగా వచ్చి కూచోమన్నది. అతను ఆశ్చర్య పోయాడు, కాని ఆమె ఆజ్ఞ ప్రకారం ఆమె శయ్యకు సమీపంగా వెళ్ళి



కూచున్నాడు. ఆమె అతని చెయ్యి అందుకుని ఇంకా దగ్గిరికి లాగింది. అలీషార్ ముఖాన కనబడిన ఆశ్చర్యం చూసి ఆమెకు నవ్వాగలేదు. ఆమె విరగబడి నవ్వుతూ, "ఇంకా నీ బానిసను గుర్తించలేదా, అలీషార్?" అని అడిగింది.

ఆ మాట అన్నదాకా అతను జముర్రుద్ ముఖం కేసి పరీక్షగా చూడలేదు. ఆమెను గుర్తించినాక అతనికి గలిగిన ఆనందం వర్ణనాతీతం. ఇంత కాలానికి అతని అన్వేషణ ఫలించింది.

మర్నాడు తెల్లవారుతూనే జముర్రుద్ రాజరికపు దుస్తులన్నీ ధరించి, తన కింది ఉద్యోగు లందరినీ రాజప్రాంగణంలో హాజరు కమ్మని కబురు పంపింది. అందరూ వచ్చాక ఆమె వారితో, "ఇవాళ నుంచీ నేను నా రాజరికాన్ని వదులుకుంటున్నాను. అందుచేత మీరు మళ్ళీ నగర ద్వారం వద్దకు వెళ్ళి మరొక రాజును సంపాదించుకోండి. ఇక నుంచీ నా జీవితం ఈ యువకుడి జీవితంతో ముడి పడి ఉంది. నేను ఇతని దేశానికి వెళ్ళి పోతున్నాను. మిమ్మల్ని అల్లా కాపాడతాడుగాక!" అన్నది.

నగర పౌరులు తమ రాజుగారికి అద్భుతమైన వీడ్కోలు ఇచ్చారు. రాజుగారి పెట్టెల నిండా అంతులేని బట్టలూ, నగలూ, డబ్బూ నించారు. ఆహారం సిద్ధం చేశారు. పెట్టెలన్నిటినీ ఒంటెలపై కెక్కించారు. రెండు మూపురాల ఒంటె మీద మఖ్మల్ పరిచిన పల్లకిలో జముర్రుద్‌నూ, అలీషార్‌నూ ఎక్కించారు.

ఇవన్నీ వెంట బెట్టుకుని అలీషార్ తన నగరానికి వచ్చాడు. అతను బీద సాదలకు దాన ధర్మాలు చేశాడు. తమ వద్ద పుష్కలంగా ఉన్న డబ్బుతో అలీషార్ జముర్రుద్‌లు చాలాకాలం సుఖంగా కాపరం చేసి అనేక మంది పిల్లలను కన్నారు.

—(సమాప్తం)





# చిలుక బుద్ధి

పెద్దబ్బాయి భలే గమత్తు చేశాడు. తాతయ్య వాణ్ణి పిలిచి, రెండణాలిచ్చి, "దబ్బున వెళ్ళి నస్యం పట్టుకురారా!" అన్నాడు. పెద్దవాడు దుకాణానికి వెళ్ళుతుండటం పసి కట్టి అమ్మమ్మ, "ఆ చేత్తోనే ఒక కొబ్బరి కాయ పట్టుకురారా, బాబూ. దేవుడికి కొట్టాలి," అన్నది. ఇంతలోనే నాన్న వాణ్ణి పిలిచి, "సిరాబుడ్డి ఖాళీ అయింది. కొత్త బుడ్డి పట్టుకురారా," అంటూ చేతిలో రూపాయి పెట్టాడు. ఒక పావుగంటకు పెద్ద వాడు సిరాబుడ్డితో సహా చక్కా వచ్చాడు. కొబ్బరికాయ మాటా, తాతయ్య పొడుం మాటాకూడా వాడు మరిచాడు. వాడు మళ్ళీ వెళ్ళి వాటిని తెచ్చాడనుకోండి. అయినా పిల్లలు వాడు చేసిన పనిని తలుచుకుని, తలుచుకుని రోజల్లా నవ్వుకున్నారు.

"కొందరికి చిలుక బుద్ధి ఉంటుందర్రా. వాళ్ళు మాటలు జ్ఞాపకం ఉంచుకుంటారు గాని, అర్థం చేసుకోరు. ఒక మాట మీద ఇంకో మాట వినగానే మొదటి మాట ఎగిరి చక్కా పోతుంది. అఖరుకు విన్నమాటే జ్ఞాపకం ఉంటుంది. ఇలాటి వాడే వెనకటి కొకడుండేవాడు," అంటూ తాతయ్య పొడుం కాయ తీశాడు.

"కథ! కథ!...పెద్దబ్బాయంటివాడేనా, తాతయ్యా?...వాడేం చేశాడు, తాతయ్యా?" అని కుర్రాళ్ళు ప్రశ్నల వర్షం కురిపించారు.

తాతయ్య తాపీగా పొడుం పీల్చి చెప్ప నారంభించాడు :

ఒకనాడు వాడి అమ్మమ్మ వాడితో అన్నదిగదా, "శాస్తుల్లుగారి దగ్గిరికి వెళ్ళి అమావాస్య ఎప్పుడుందో కనుక్కురారా," అని చెప్పింది.

వాడు సరేనని శాస్తుల్లుగారింటికి బయలు దేరాడు. తన మనమడి సంగతి ముసిలా విడకు తెలుసుగా. అందుకని ఆవిడ వాడితో,

"ఒరే. ఆయన చెప్పింది అప్పుడే మరిచి పోతావు. అందుకని ఆయన చెప్పిన మాటలు మననం చేసుకుంటూ మరీరా!" అని హెచ్చరించింది.

వాడు దానికూ్కడా సరేనని శాస్తుల్లుగారి నడిగాడు. శాస్తుల్లుగారు, "అప్పుడే ఎక్కడ? ఇవాళ పౌర్ణమేగా! ఇంకా పదిహేను రోజులకుగాని రాదు," అన్నాడు.

మనమడు, "అప్పుడే ఎక్కడ? ఇంకా పదిహేను రోజులకు! అప్పుడే ఎక్కడ? ఇంకా పదిహేను రోజులకు!" అని గట్టిగా అంటూ ఇంటికి బయలుదేరాడు. వాడిలా వస్తూండగా దోవలో కాలవ ఒడ్డున ఒక మనిషి చేపల కోసం గాలం వేసుకుని కూచున్నాడు. ఎంతకీ చేప పడకపోవటం చూసి వాడు విసుగెత్తి, "చేపలు దొరికే దెప్పుడూ? నే నింటికి పొయ్యే దెప్పుడు?" అని తనలో తాను అనుకుంటున్నాడు.

సరిగా అదేసమయానికి మన బడుద్ధాయి, "అప్పుడే ఎక్కడ? ఇంకా పదిహేను రోజులకు!" అని గట్టిగా అంటూ వచ్చాడు.

గాలం వేసుకూ్కచున్న వాడికి మండిపోయింది. "ఎవడ్రా వీడూ? వీణ్ణి పాతెయ్యా!" అని వాడు కోపంతో అన్నాడు.

ఈ మాటలు వినగానే మన ప్రబుద్ధుడికి శాస్తుల్లుగారు చెప్పిన మాటలు పోయి



"ఎవడ్రా వీడూ? వీణ్ణి పాతెయ్యా!" అన్న మాటలు పట్టుకున్నాయి. అవే గట్టిగా అంటూ వాడు కొంతదూరం నడిచి ఒక ఇంటి పక్కగా వచ్చాడు.

ఆ ఇంట్లో ఒక రోగి ఉన్నాడు. అతడి చుట్టూ బంధువులు చేరి విచారంగా ఉన్నారు. వాళ్ళలో కొందరు వీడి మాటలు విని ఆగ్రహావేశంతో తన్నబోయారు. కాని మరి కొందరు వాళ్ళను వారించి, "ఊరుకోండి. వాణ్ణి అలా ఆనందంగా కాలి పోనివ్వండి," అన్నారు.

మనవాడికి పాతమాటలు పోయి కొత్త మాటలు అంటుకున్నాయి. "ఊరుకోండి, ఆనందంగా కాలి పోనివ్వండి," అంటూ అక్కడి నుంచి బయలుదేరాడు. త్వరలోనే వాడు ఒక ఇల్లు తగలబడి పోతున్న చోటికి వచ్చాడు. అంటుకున్న ఇంటిని ఆర్పటానికి కొందరు యత్నిస్తున్నారు. మనవాడు నిలబడి వింతగా చూస్తూ, "ఊరుకోండి, ఆనందంగా తగలబడనివ్వండి," అన్నాడు.

"ఎవడ్రా వాడూ? నెత్తిన బిందెడు నీళ్ళు పోసి కర్రతో మెత్తగా కొట్టు!" అని ఎవరో కేకపెట్టారు.

"బిందెడు నీళ్ళు పోసి కర్రతో కొట్టు," అని మననం చేసుకుంటూ ముసలమ్మ మనవడు అక్కడి నుంచి పారిపోయాడు.



ఇలా గట్టిగా అంటూ వాడు పరిగెత్తుకు వస్తూండగా, ఒక కుమ్మరి కుండలు చెయ్యటానికి మట్టి కలుపుతూ, తనకు వాడు సలహా ఇస్తున్నాడనుకుని, "నీ దారిన నువు పోవయ్యా!" అన్నాడు.

"నీ దారిన నువు పోవయ్యా," అన్న మాట జపించుకుంటూ వాడు కొంత సేపటికి ఇల్లు చేరుకున్నాడు.

"ఇంత సేపేమిట్రా? శాస్తుల్లుగారు ఏమన్నారు?" అని అమ్మమ్మ అడిగింది.

"నీ దారిన నువు పోవయ్యా, అన్నారు," అని మనమడు జవాబు చెప్పాడు.

"ఓహో, కుర్రకుంక పని అలా చెప్పి ఉంటారు. నా కోసం అడుగుతున్నానని మళ్ళీ అడిగిరా. ఎప్పుడు వస్తుందో తెలుసుకుని రా!" అన్నది ముసలావిడ.

వాడు మళ్ళీ శాస్తుల్లుగారి ఇంటికి వెళ్ళి, "మా అమ్మమ్మ కోసం అడుగుతున్నానండీ. అదేదో ఎప్పుడు వస్తుందండీ?" అన్నాడు.

వాడు తన అమ్మమ్మ అబ్దికం కోసం అడుగుతున్నాడనుకుని శాస్తుల్లుగారు, "ఆవిడ ఎప్పుడు పోయింది? అమావాస్యకు ముందా, వెనకా?" అని అడిగాడు.

"అదేనండీ! అమావాస్యే!" అన్నాడు మన ప్రబుద్ధుడు. అప్పటిదాకా వాడికా మాట జ్ఞాపకం రాలేదు.

"అమావాస్యనాడే పోయిందా? అయితే ఆ రోజుకు నేను మీ ఇంటికి వస్తాలే! మీ ఇల్లెక్కడ?" అని శాస్తుల్లుగారు అడిగాడు.

మనమడు ఆయనకు ఇల్లు గుర్తు చెప్పి ఇంటికి వచ్చి, "అమావాస్యనాడు శాస్తుల్లుగారు వస్తానన్నాడు," అని అమ్మమ్మతో చెప్పేశాడు.

ఇంతకూ అమావాస్య ఎప్పుడో ముసలమ్మకు తెలియనే లేదు. అందుకని ఆవిడే శాస్తుల్లుగారింటికి బయలుదేరి వెళ్ళి అమావాస్య ఇంకా పదిహేను రోజులుందని తెలుసుకు వచ్చింది.





# వెర్రి బాగులవాడు

ఒక గ్రామంలో ఒక విధవరాలికి ఒక్కడే కొడుకుండేవాడు. కాని వాడు వెర్రి బాగుల వాడు. వాడికి ఒంట్లు కూడా సరిగా రావు. దుకాణానికి వెళ్ళి రూపాయి మార్చితే దుకాణ దారిచ్చిన చిల్లర డబ్బులు సరిగా ఉన్నాయో లేవో కూడా వాడు కనుక్కోలేక పోయేవాడు. ఈ సంగతి బాగా గుర్తించిన దుకాణాల వాళ్ళు వాణ్ణి తరుచు మోస గిస్తూండేవారు.

తన కొడుకు వెర్రి బాగులవాడన్న కారణంచేత వాడి తల్లి వాణ్ణి కంటిని రెప్ప లాగా కాపాడుతూ, మూడు పూటలా శ్రద్ధగా తిండిపెడుతూ, ఎంతో ప్రేమగా ఉండేది. కాని వాడే తన తెలివి తక్కువతనాన్ని తలుచుకుని దిగులుపడేవాడు.

"నా కింకా కొంచెం మెదడుంటే బాగుండే దమ్మా! మెదడు లేనందువల్ల నేను నీకు కొంచెమైనా పనికిరాకుండా ఉన్నాను. మన ఇద్దరి భారమూ నువే మోస్తున్నావు గద!" అనేవాడు కొడుకు.

"అందరూ తెలివిగలవాళ్ళే ఉంటారా, నాయనా? నీకు దేవుడు తెలివితేట లివ్వక పోతేనేం? మంచితనం ఇచ్చాడు, ఇద్దరికి సరిపడే కండపుష్టి ఇచ్చాడు. నువు చెయ్య గల శ్రమ ఇంకెవరు చెయ్యగలరు?" అని విధవరాలు వాణ్ణి సముదాయించేది.

కాని ఈ విధమైన మాటలు వాడికి నచ్చక, "నేను తెలివిగల వాణ్ణయే దెలా గమ్మా?" అని పదేపదే తల్లిని వేధించ సాగాడు. వాడి బాధపడ లేక తల్లి, "మిట్ట మీద ఉండే మంత్రాల మరిడెమ్మను అడిగి కొంచెం తెలివితేటలు తెచ్చుకో!" అని సలహా ఇచ్చింది. అ మాట నమ్మి మంత్రాల మరిడెమ్మ దగ్గిరికి వాడు పరిగెత్తుకు వెళ్ళాడు. మరిడమ్మ పొయ్యి దగ్గిర కూచుని వంట చేసుకుంటున్నది.

---

కె. నరసింహారావు



"మరిడెమ్మత్తా, నాకు కాస్త తెలివితేట లిప్పిస్తావా? బొత్తిగా మందమతినైపోయి మా అమ్మకు సహాయం చెయ్యలేకుండా ఉన్నాను! మతిలేనివాళ్ళకి నువ్వు తెలివి తేట లివ్వగలవని మా అమ్మ చెప్పి పంపింది," అన్నాడు వెర్రి బాగులవాడు, ఎంతో దీనంగా.

మరిడెమ్మ వాడి కేసి ఎగాదిగా చూసి, "అన్నిటికన్న నీకు ఎక్కువ ఇష్టమైనది పట్టుకు రా. ఆ తరవాత నీ తెలివితేటలు చూస్తాను," అన్నది.

వెర్రి బాగులవాడు ఇంటికి వెళ్ళి తల్లితో మరిడెమ్మ అన్న మాట చెప్పి, "నా కన్నిటి కన్న ఎక్కువ ఇష్టమైన దేమిటమ్మా?" అని అడిగాడు.

"కోడిమాంసం రా, నాయనా. రేపాక కోడిని పట్టుకు వెళ్ళి మరిడెమ్మ దగ్గిర తెలివితేటలు తెచ్చుకో," అన్నది తల్లి.

మర్నాడు వాడు ఒక కోడిని తీసుకుని మరిడెమ్మ వద్దకు వెళ్ళి, "నాకు అన్నిటి కన్న ఇష్టమైనది తెచ్చానత్తా!" అన్నాడు.

"ఆ మాట నిజమో, కాదో తేల్చుకోవాలి. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పు. కాళ్ళు లేకుండా పరిగెత్తే దేది?" అని మంత్రాల మరిడెమ్మ వెర్రి బాగులవాణ్ణి అడిగింది. చాలాసేపు బుర్ర గోక్కుని, తనకు తెలియ దన్నాడు వాడు.

"అయితే నువు నీకు ఎక్కువ ఇష్ట మైనది తేలేదు. వెళ్ళి ఇంకోసారి రా; నీకు అన్నిటికన్న ఇష్టమైనది వెంట తీసుకు రా!" అని మరిడెమ్మ వాణ్ణి పంపేసింది.

వాడు ఇంటికి తిరిగివచ్చే సరికల్లా వాడి తల్లి మంచాన పడి ఉన్నది. చాలామంది చేరి చికిత్స చేయిస్తున్నారు. ఏమిటని అడి గితే ఆమె ఉన్నట్టుండి పక్షవాతంతో పడి పోయిందని చెప్పారు. చికిత్స లేమీ పని చెయ్యలేదు. ఆమె కొడుకును దగ్గిరికి పిలిచి, "ఇక నేను బతకను, నాయనా!

మరిడెమ్మ నీకు తెలివితేట లిచ్చింది గద! ఇక నేను లేకపోయినా నీ మానాన నువు బతుకుతావులే! నే నిక నిశ్చింతగా ప్రాణాలు వదులుతాను," అని కన్ను మూసేసింది.

ఆ రాత్రంతా వాడు తల్లి కోసం కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, "మా అమ్మ లేకుండా ఎట్లా బతకటం? ఇక నన్ను ఎవరు కనుక్కుంటారు? నా అవసరాలన్నీ ఎవరు తీరుస్తారు?" అనుకున్నాడు. ఈ విధంగా అనుకోవటంలో వాడికి ఒక సంగతి తెలిసి వచ్చింది: తనకు ప్రపంచం లోకెల్లా ఇష్టమైనది తల్లి తప్ప మరేదీ ముమ్మాటికీ లేదు!

అందుచేత వాడు తన తల్లి కళేబరాన్ని ఒక గోతంలో వేసుకుని మరిడెమ్మ దగ్గిరికి వెళ్ళి, "అన్నిటి కన్నా ఇష్టమైనదాన్ని తెచ్చాను; నాకు తెలివితేట లియ్యి, మరిడెమ్మత్తా," అని అడిగాడు.

"ఆ మాట నిజమో కాదో తేల్చుకో వాలి. ఈ ప్రశ్నకు జవాబు చెప్పు: బంగారం కాకుండానే బంగారం కన్న కాంతిగా మెరిసే దేది?" అని మరిడెమ్మ వెర్రి బాగులవాణ్ణి అడిగింది.

వెర్రి బాగులవాడు చాలా ఆలోచించి తనకు తెలియదన్నాడు. అయితే వెళ్ళి



పోయి మరొకసారి రమ్మనీ, వచ్చేటప్పుడు వాడికి ఎక్కువగా ఇష్టమైనదాన్ని తెమ్మనీ మరిడెమ్మ అన్నది.

వెర్రి బాగులవాడు తల్లిని సంచీతోబాటు భుజాన వేసుకుని ఇంటి దారి పట్టాడు. అయితే వాడు మధ్య దారిలోనే ఒకచోట చతికిలబడి తన దుస్థితి తలుచుకుని భోరున ఏడవసాగాడు.

"ఎందు కేడుస్తున్నావు?" అని ఎవరో ప్రశ్నించటం విని వాడు తల ఎత్తి చూసే సరికి రాధ అనే పిల్ల కనిపించింది. వాడా మెతో తల్లి చచ్చిపోయి తను అసహాయ స్థితిలో ఉండటమూ, తనకు తెలివితేట

లిచ్చే మంత్రాల మరిడెమ్మ అడిగిన ప్రశ్నలకు తాను సమాధానా లివ్వలేకపోవటమూ చెప్పాడు. ఆ ప్రశ్నలు విని రాధ నవ్వి, "కాళ్ళు లేకుండా పరిగెత్తేది నది, బంగారం కన్న బాగా మెరిసేది సూర్యుడు. అది కూడా తెలీదా? నీ వంటివాణ్ణి ఎవరో ఒకరు కనిపెట్టి ఉండవలిసిందే! నేనే కనిపెట్టి ఉంటాను. తెలివితేటలు లేనివాళ్ళు భార్యలను బాగా చూస్తారని చెబుతారు. నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అని అడిగింది.

"నీ కభ్యంతరం లేకపోతే నా కిష్టమే," అన్నాడు వెర్రి బాగులవాడు. వాళ్ళిద్దరూ పెళ్ళాడారు. రాధ వాణ్ణి తల్లి కన్న బాగా కనిపెట్టి ఉంటున్నది.

వాడు కూడా రాధ చెప్పిన పనులు ఎంత బరువైనా చేసేస్తున్నాడు. ఇద్దరికీ జంట బాగా కుదిరింది.

ఒకనాడు అకస్మాత్తుగా వెర్రి బాగులవాడు తెలుసుకున్నాడు: తనకు ప్రపంచంలో తన భార్యకన్న ఇష్టమైన దేదీలేదు. అందుచేత వాడు రాధను వెంటబెట్టుకుని మరిడెమ్మ వద్దకు వెళ్ళి, "అత్తా, ఈసారి నిజంగా నా కిష్టమైనదాన్ని తెచ్చాను. నాకు తెలివితేట లియ్యి," అన్నాడు.

"అలాగా? అయితే చెప్పు: కాళ్ళు లేకుండా పుట్టి, మొదట రెండు కాళ్ళు సంపాదించి, చివరకు నాలుగు కాళ్ళు తెచ్చుకునేది ఏది?" అని మరిడెమ్మ అడిగింది.

వెర్రి బాగులవాడు బుర్ర గోక్కోవటం చూసి రాధ వాడి చెవిలో, "కప్ప!" అని రహస్యంగా చెప్పింది. "కప్ప," అన్నాడు వెర్రిబాగులవాడు.

"ఫరవాలేదు. నీది మట్టిబుర్ర అయినా నీ భార్యది తెలివైన బుర్రే. దాన్ని మీరిద్దరూ పంచుకుని సుఖంగా ఉండండి," అని మంత్రాల మరిడెమ్మ వాళ్ళిద్దరినీ దీవించి పంపేసింది.






ఆ మాయలేడిని చూస్తుంటే రాముడికి కూడా సీతకు కలిగినట్టే దాని పైన భ్రమ పుట్టుకొచ్చింది. అతను లక్ష్మణుడితో, "నీవూ, జటాయువూ సీతను చూసుకోండి. నేను ఈ లేడిని పట్టి తెస్తాను," అని కత్తీ, విల్లంబులూ పుచ్చుకుని బయలుదేరాడు.

మారీచుడు తన పని శక్తి వంచన లేకుండా నిర్వహించాడు. అతను లేడి రూపంలో కనిపిస్తూ, మాయమవుతూ, ఒకసారి దూరమవుతూ, ఒకసారి దగ్గరలోనే ఉంటూ రాముణ్ణి ఆశ్రమం నుంచి చాలా దూరం తీసుకుపోయాడు. ఇక ఆ లేడి తనకు ప్రాణాలతో చిక్కదని తోచి రాముడు ఒక తీవ్రమైన బాణం ఎక్కుపెట్టి ఆ లేడి గుండెలో దూసుకు పోయేటట్టు కొట్టాడు. మారీచుడు వెంటనే లేడి రూపు వదిలి తన రాక్షసరూపుతో కిందపడిపోతూ, "అయ్యో! సీతా! లక్ష్మణా!" అని రాముడి గొంతుతో అరిచి ప్రాణాలు వదిలాడు. ఆ అరుపు రాముడి చెవికి అశుభంగా తోచింది. మాయలేడి మారీచుడే! అస్పష్టమైన భయాలు మనసును ఆవరించగా రాముడు మరొక లేడిని చంపి, దాని మాంసం తీసుకుని వేగంగా తమ పర్ణశాల కేసి నడవసాగాడు.

"లక్ష్మణా, అది నీ అన్న చేసిన ఆర్తనాదం. నాకేమో భయంగా ఉంది. నీవు వెంటనే వెళ్ళి రాముణ్ణి కాపాడు," అన్నది సీత ఆశ్రమంలో.



సీత ఎంతగా విలవిలలాడుతున్నప్పటికీ చలించక లక్ష్మణుడు, "దేవ మానవ గంధర్వ రాక్షసులలో అన్నను భయపెట్ట గలవా రెవరూ లేరు. ఇది రాక్షస మాయ. అన్న నన్ను నీకు తోడుగా ఉండమన్నాడు. నేను వెళ్ళను," అన్నాడు.

"ఆయన ఆపదలో ఉంటేకూడా పోనంటావే, నీ వాయనకు మిత్రుడవా, శత్రుడవా? నీవు కోరేది రాముడి నాశనం లాగుందే! నా మీద దురాశపెట్టుకున్నావా? రాముడికి నిజంగా ఆపదే కలిగితే నేను మరుక్షణం నశిస్తాను. నన్ను నీవు రక్షించేదేమిటి?" అన్నది సీత.

లక్ష్మణుడు ఎన్నోవిధాల సీత భయాన్నీ, అనుమానాన్నీ పోగొట్ట యత్నించాడు. కాని అతని ప్రయత్నం ఫలించలేదు. ఆమె అతన్ని బాగా ఎత్తి పొడిచింది. "నీవు ఎవరి కోసం రాముడి వెంటపడి వచ్చావు? నీ కోసమా, భరతుడి కోసమా? నేను నీకు గాని, భరతుడికి గాని దక్కుతానని కలలో కూడా అనుకోవద్దు," అన్నది.

చివరకు లక్ష్మణుడు చిరాకుపడి, "అనరాని మాటలనటం స్త్రీలకు సహజమే. నన్నిన్ని మాటలన్నందుకు నీకు కీడు తప్పదు. నేను వెళ్ళినాక నీకు దేవతలే దిక్కు," అంటూ అయిష్టంగా అన్న కోసం బయలుదేరాడు.

అతను అలా వెళ్ళాడో లేదో రావణుడు సన్యాసి రూపంలో ఒంటరిగా ఉన్న సీత వద్దకు వచ్చాడు. అతను సన్నని కాషాయ వస్త్రం ధరించి, గొడుగు వేసుకుని, పావుకోళ్ళు కాళ్ళకు ధరించి, దండానికి కమండలం తగిలించి ఎడమ భుజానికి ఆన్చి, వేదాలు చదువుతూ వచ్చి, కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్న సీతను పరిశీలించి చూశాడు. ఆమె పచ్చని పట్టుచీర కట్టుకొని ఉన్నది. ఆమె సర్వావయవాలలోనూ సౌందర్యం తొణికిసలాడుతున్నది. ఆమె

మెడలోని రత్నహారాలు మెరుస్తున్నాయి. రావణుడు సీతను పలకరించి, "అమ్మాయీ, నీ వెవరు? పార్వతివా? అప్సరవా? లక్ష్మీదేవివా? కాంతిదేవతవా? మానవ దేవ యక్ష కిన్నర గంధర్వులలో నీ వంటి సుందరిని నే నెన్నడూ చూడలేదు. ఇంత సుకుమారివి, సుందరివి, చిన్నదానివి ఈ రాక్షస మయమైనచోట ఏంచేస్తున్నావు? ఒంటరిగా ఎందుకున్నావు?" అని అడిగాడు.

సీత రావణుణ్ణి చూసి నిజమైన సన్యాసి అనుకుని అర్ఘ్యపాద్యాదు లిచ్చి అతిథి సత్కారాలు చేసి, పీట వేసి, వంట సిద్ధంగా ఉన్నది, భోజనం చెయ్యమని ఆహ్వానించింది. ఆమె ఆ సన్యాసి అడిగిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ, తన వివాహం జరగటమూ, తాను పన్నెండేళ్ళు కాపరం చేసిన అనంతరం తన మామగారు తన భర్తకు పట్టాభిషేకం తల పెట్టటమూ, కైకేయి ఆ ప్రయత్నాన్ని భగ్నం చేసి తన భర్తను అడవులకు పంపటమూ మొదలైన వృత్తాంత మంతా చెప్పింది. అంతా చెప్పి ఆమె రావణుణ్ణి, "మీ పేరేమిటి? గోత్ర మేమిటి? మీరీ దండకారణ్యంలో ఒంటిగా ఎందుకు తిరుగుతున్నారు?" అని అడిగింది.

సీత ఈ ప్రశ్న అడగగానే రావణుడు, "నేను రాక్షసరాజును, రావణుణ్ణి. నాకు





ఎందరో భార్యలున్నారు గాని ఒక్కరూ నీతో సమానం కారు. నేనుండే లంకా పట్టణం సముద్రం మధ్య ఎత్తయిన పర్వతం మీద ఉన్నది. ఈ అరణ్యం వదిలిపెట్టి నాతో వచ్చెయ్యి. ఉద్యాన వనాలలో విహరింతాం. నీకు అయిదువేల మంది దాసీలను ఏర్పాటు చేస్తాను," అన్నాడు.

ఈ మాటలు విని సీత భయపడటానికి బదులు మండిపడింది. రావణుణ్ణి తిట్టింది, బెదిరించింది. రాముడి పరాక్రమం వివరించింది. అంతా విని రావణుడు తన పరాక్రమం చెప్పుకున్నాడు. తాను కుబేరుడి తమ్ముణ్ణనీ, కుబేరుడి పుష్పక విమానాన్ని లాక్కొన్నాననీ, తన పేరు చెబితేనే సమస్త దేవతలూ భయపడతారనీ అన్నాడు. రాముడు అసమర్థుడు గనకనే రాజ్యం వదిలిపెట్టి అడవులలో అష్టకష్టాలూ పడుతున్నాడన్నాడు. "నీవు రాముడికి భయపడి నాతో వచ్చెయ్యటానికి జంకుతున్నావేమో, నా వెంట ఉన్న నిన్ను రాముడేమీ చేయలేడు. అతడు నా గోరికి చాలడు," అన్నాడు.

"కుబేరుడి తమ్ముణ్ణని చెప్పుకుంటూ ఇలాటి పాపపు బుద్ధు లేమిటి? నీ కీ పరస్త్రీ వాంఛ పోకపోతే నీవూ, నీ రాక్షసులూ నాశనం కాక తప్పదు," అన్నది సీత.

రావణుడు మండి పడి చేతులు చరిచి తన నిజ రూపం ధరించి భయంకరంగా సీత ఎదట ప్రత్యక్షమయాడు. అతని కళ్ళు చింత నిప్పుల్లాగున్నాయి, శరీరం నల్లగా ఉన్నది. చెవులకు బంగారు పోగులున్నాయి. అతను సీతతో, "పిచ్చిదానా, నీకు నాకన్న ఖ్యాతి గల భర్త ఎక్కడ దొరుకుతాడు? ఇప్పుడు నన్ను నిరాకరించి తరవాత పశ్చాత్తాప పడతావు," అంటూ ఆమెను పట్టుకున్నాడు. ఎడమచేత్తో సీత జుట్టూ, కుడిచేత్తో తొడలూ పట్టుకుని రావణుడు ఆకాశానికి ఎగిరాడు. సీత గిలగిలా తన్ను

కుంటూ రాముణ్ణి కేక పెట్టింది, లక్ష్మణుణ్ణి పిలిచింది. "రావణుడు సీతను ఎత్తుకు పోయినాడని రాముడితో చెప్పండి," అని చెట్లతో మొర పెట్టుకున్నది.

ఇంతలో ఒక చెట్టు పైన సీతకు జటాయువు కనిపించాడు.

సీత జటాయువుతో, "నాయనా, జటాయూ! నన్ను రాక్షసుడు బలాత్కారంగా తీసుకు పోతున్నాడు. ఈ మాట రాముడికి చెప్పు," అన్నది.

చెట్టు మీద కునికిపాట్లు పడుతున్న జటాయువు ఈ మాటలకు ఉలిక్కి పడి కళ్ళు తెరిచి చూసి రావణుడితో ఇలా అన్నాడు:

"రావణా, నీవు చేసేది చాలా తప్పు పని. మామూలు మనుషులు తమ భార్యలను పర పురుషుల నుంచి ఎలా కాపాడుకుంటారో రాజైనవాడు ఇతరుల భార్యలను కూడా అలా కాపాడాలి. నేను సౌమ్యుణ్ణి, వృద్ధుణ్ణి, నిరాయుధుణ్ణి. నీవు యువకుడివి, ఆయుధాలు కలవాడివి. అయినా నిన్ను సీత నెత్తుకు పోనివ్వను. రామలక్ష్మణులు దూరాన ఉన్నప్పుడు పిరికిగా నీవీ పని చేస్తున్నావు."

ఈ మాట లంటూనే జటాయువు రావణుడిపై తలపడ్డాడు. రావణుడు తన రథంలో ఉండి ధనుర్బాణాలతో పోరాడు





తుంటే మహా బలశాలి అయిన జటాయువు తన గోళ్ళతోనూ, కాళ్ళతోనూ, ముక్కుతోనూ కలియబడి రావణుడి కవచాన్ని నిర్మూలించాడు. అతని శరీరాన్ని చీరాడు, అతని ధనువులను విరిచాడు, రథపు గాడిదలనూ, సారథినీ కూడా చంపాడు. చివరకు రథాన్నే విరిచాడు.

రావణుడు విరథుడై సీతను చంకన పెట్టుకుని భూమి పైకి దిగవలిసి వచ్చింది. ఇంత చేసిన మీదట జటాయువు అలిసి పోయాడు. అది గమనించి రావణుడు సీతతో సహా మళ్ళీ ఆకాశానికి ఎగిరాడు. కాని జటాయువు ఎగిరి వెళ్ళి రావణుడికి అడ్డు తగిలాడు. అతను రావణుడితో, "ఛీ, ఛీ! నీవు వీరుడివి కావు, పిరికిపందవు. వీరుడివైతే రామలక్ష్మణులు వచ్చినదాకా ఉండి వారితో యుద్ధం చెయ్యి," అన్నాడు.

రావణుడు వినిపించుకోక ముందుకు సాగిపోయాడు. జటాయువు రావణుడి వెన్నంటి, అతని వీపుమీద వాలి తన గోళ్ళతో గీరసాగాడు, రావణుడి వెంట్రుకలు పీకాడు. రావణుడు మండిపడి సీతను నేలపై దించి జటాయువుతో కలియబడ్డాడు. ఇద్దరికీ తీవ్రమైన యుద్ధం జరిగింది. చివరకు రావణుడు కత్తి దూసి జటాయువు రెక్కలూ, పక్కలూ, పాదాలూ నరికేశాడు. జటాయువు కొన ఊపిరితో నేల మీద పడిపోయాడు. సీత వలవలా ఏడుస్తూ జటాయువు దగ్గిరికి పరిగెత్తింది. జటాయువును కౌగలించుకుని భోరున ఏడ్చింది. "రామా, లక్ష్మణా! ఇప్పుడన్నా వచ్చి నన్ను రక్షించండి!" అని కేక పెట్టింది. రావణుడు తన కేసి రావటం చూసి సీత లతలను పట్టుకునీ, చెట్లను పట్టుకునీ వేళ్ళాడింది. "చాలించు ఈ వేషాలు," అంటూ రావణుడు ఆమె జుట్టు పట్టుకుని ఆమెను తన ఒడిలో పెట్టుకుని తిరిగి ఆకాశ గమనం సాగించాడు.

రావణుడు అతివేగంగా పోతూంటే సీత యొక్క ఆభరణాలు కొన్ని భూమి మీద పడి పోయాయి. సీత రావణుణ్ణి పిరికి వాడని అవమానించింది, దొంగ అన్నది, తిట్టింది, ఇప్పటికైనా తనను వదిలేస్తే రాముడు క్షమిస్తాడని ఆశ పెట్టింది; "ఏది కోరి నన్ను ఇలా తీసుకు పోతున్నావో అది నీకు ఒనగూడదు; ఎందుచేతనంటే నేను రాముణ్ణి విడిచి ఎంతో కాలం బతకను," అని కూడా చెప్పి చూసింది. రావణుడీ మాట లేవీ పట్టించుకోలేదు.

ఆకాశంలో పోతున్న సీతకు ఒక కొండ శిఖరం మీద అయిదుగురు వానరులు కని పించారు. "వీరు నా సంగతి రాముడితో ఒక వేళ చెబుతారేమో," అనుకుని సీత తన పసుపుపచ్చని పైబట్టలో తన ఆభర ణాలు కట్టి ఆ వానరుల మధ్య పడేలాగా వేసింది. ఈ సంగతి రావణుడు గమనించ లేదు. కాని వానరులు మాత్రం సీతను చాలా సేపు కళ్ళార్పకుండా చూస్తూ ఉండిపోయారు.

రావణుడు పంపా సరస్సు దాటి, సము ద్రాన్ని చేరి, దాన్నికూడా దాటి తనపాలిటి మృత్యువైన సీతతో సహా లంకను చేరాడు.

లంకాపురం అతి అందమైన నగరం. అక్కడి రాజమార్గాలు తీర్చిదిద్దినట్టుగా ఉంటాయి. అనేక ప్రాకారాలతో కూడి ఉన్న అంతఃపురంలోకి రావణుడు సీతతో సహా ప్రవేశించాడు. అతను భయంకరాకా రాలు గల అక్కడి రాక్షస స్త్రీలను పిలిచి, "నా అనుమతి లేకుండా ఒక పురుషుడు గాని, స్త్రీగాని ఈ సీతను చూడరాదు. ముత్యాలో, రత్నాలో, బంగారమో, బట్టలో - ఈమె ఏమి కోరితే అది ఎల్లా నాతో చెప్ప కుండానే ఈమెకు ఇచ్చెయ్యాలి. ఈమె మనస్సుకు కష్టం కలిగించే మాట ఒక్కటి ఎవరైనా అన్నారో తక్షణం వాళ్ళ ప్రాణాలు తీస్తాను," అని హెచ్చరించాడు.



# 14. క్రెమ్లిన్

క్రెమ్లిన్ అంటే రష్యన్ భాషలో "దుర్గం" అని అర్థం. "మాస్కోపైన క్రెమ్లిన్ తప్ప మరోటి లేదు, క్రెమ్లిన్ పైన స్వర్గమే" అని ఒక సామెత కూడా ఉన్నది. ఈ దుర్గాన్ని నిర్మించటం ప్రారంభించినది 1647 లో. ఇది పూర్తి కావటానికి 125 ఏళ్ళు పట్టింది.

క్రెమ్లిన్‌ను త్రికోణాకారం గల స్థలంలో, మొస్క్వా నది పక్కన నిర్మించారు. దీని చుట్టూ 65 అడుగుల ఎత్తు గల ప్రాకారం ఉన్నది. ఇటుకలతో కట్టిన ఈ ప్రాకారం నిడివి 10 ఫర్లాంగులు. క్రెమ్లిన్‌లో ఎన్నో రాజభవనాలూ, కచేరీ భవనాలూ, ఆలయాలూ, చర్చీలూ, ఆయుధాగారాలూ, బాతకానులూ ఉన్నాయి. ఇక్కడ ఉండే భవనాలలో "పాలెస్ అఫ్ ది సోవియెట్స్" అనేది ఈనాడు కూడా ప్రపంచ మంతటిలోకీ ఎత్తయిన కట్టడం. దీని ఎత్తు 1365 అడుగులు.

1600 లో ఇక్కడ జార్ చక్రవర్తి ఇవాన్ వ్యెలీకియ్ గంట స్తంభం నిర్మింపజేశాడు. అందులో 33 గంటలు వేళ్ళాడ గట్టారు. వాటన్నిటిలోకి పెద్దది 65 టన్నుల బరువున్నది. 200 టన్నుల బరువు గల మరొక బ్రహ్మాండమైన గంట—ప్రపంచంలో కెల్లా పెద్దది—వేళాడ గట్టక పూర్వమే అగ్ని ప్రమాదం మూలంగా పగులు చూపింది. ఇది ఇప్పటికీ నేలపైనే ఉన్నది.

కింద కనిపించే బొమ్మలో "రెడ్ స్క్వేర్" ఉన్నది. విప్లవ దినంనాడు ఈ ప్రదేశం జనంతో కిటకిటలాడిపోతుంది. బొమ్మలో కుడి పక్కన "మాసోలియం" ఉన్నది. దీని లోపల లెనిన్ భౌతిక శరీరం భద్రపరచి ఉంచారు. ఉత్సవాల సమయంలో సోవియెట్ ప్రముఖులూ, విదేశీ రాయబారులూ ఈ మాసోలియం పైభాగంలో నిలబడి ప్రజలకు దర్శనం ఇస్తారు.





# ప్రశ్నోత్తరాలు

1. కాసం యాదగిరి, జనగామ

శుద్ధతిథు లారంభంలో చంద్రునికి భూమి అడ్డంగా రావడంచేత చంద్రుడు చంద్రవంకగా కనిపిస్తాడు గదా, మరి అర్ధ చంద్రునిగా కనిపించటానికి కారణమేమిటి ?

చంద్రవంక ఏర్పడటానికి కారణం భూమి అడ్డం రావడమనుకోవటం పొరబాటు. చంద్రుడిపై పడే సూర్యకాంతిలో కొద్ది భాగమే మనకు కనిపించినప్పుడు చంద్రవంకను చూస్తాం. గ్రహణ కాలంలో తప్ప భూమి చంద్రుడికి అడ్డం రాదు. గ్రహణ కాలంలో కూడా కొద్ది గంటలు మాత్రమే అడ్డొస్తుంది.

2. కుచ్చర్లపాటి సుబ్బరాజు, కొత్తలంక

రావణుడు రథానికి గాడిదలను పూన్చి మారీచుడి ఆశ్రమానికి వెళ్ళాడన్నారు. గుర్రములు లేవాండీ ?

లేవు కాబోలు !

3. యల్. కోటేశ్వరరావు, సిరిపురము

గ్రహాలలో సూర్యుడు, చంద్రుడు మాత్రమే కనిపిస్తున్నారు. బుధుడు, అంగారకుడు, శుక్రుడు మొదలగు గ్రహాలు కనబడకపోవుటకు కారణమేమి ? అవి ఎట్లు కనిపించును ?

సూర్యుడు గ్రహం కాదు, చంద్రుడు ఉపగ్రహం. మిగిలిన గ్రహాలు—శుక్రుడు, గురువు, అంగారకుడు, శని, బుధుడు—మామూలు కంటికి కనిపిస్తాయి. వేగుచుక్క శుక్ర గ్రహమే. ఇది ఇప్పుడు తెల్లవారు జామున సూర్యుడికి ముందుగా ఉదయిస్తున్నది. కొన్నాళ్ళపాటు ఈ గ్రహం పడమర కూడా, సూర్యాస్తమయం తరవాత, కనిపిస్తూ ఉంటుంది. మిగిలిన గ్రహాలు తెలిసినవారి నడిగితే ఆకాశంలో చూపుతారు. బుధ గ్రహం సూర్యుడికి మరీ సమీపంలో తిరుగుతూ ఉండటంచేత దీన్ని చూడటం కొంచెం కష్టం కావచ్చు. టెలిస్కోపులు లేని కాలంలోనే మన పూర్వులు ఈ గ్రహాలను కనిపెట్టి వాటి గమనాలు గుణించారు గనక ఇవన్నీ కంటికి కనిపించేవే.

4. ఎస్. రామకృష్ణ, చీపురుపల్లి

చంద్రునికి సూర్యునికి ఎంత దూరము ?

భూమికీ సూర్యునికీ ఉన్నంత దూరమే—సుమారు 9 కోట్ల 30 లక్షల మైళ్ళు.

5. డి. సుకుమార్, అమదాలవలస

అన్నయ్యా, మన జాతీయ రక్షణ నిధికి యింత ధనం అవసరమైనప్పుడు విరాళాల అగత్యమేమున్నది ? కావలిసినంత ద్రవ్యం ముద్రించ కూడదా ?

అలా యిష్టంవచ్చినట్టు కరెన్సీ నోట్లు ముద్రించి దేశంలో చలామణీ చేస్తే డబ్బు విలువ పడిపోతుంది. దాన్నే ద్రవ్యోల్బణం అంటారు. అందువల్ల చాలా ప్రమాదం.

6. కె. రామకృష్ణా రెడ్డి, అరవల్లి

"చందమామ" పేరిట ఇప్పటికి ఈ కార్డుతో కలసి అయిదు రూపాయలు అయినది. ఒక్కదానికి సమాధానం ఈయలేదేమండి ?

ఇలాటి ప్రశ్నలు మా కిప్పటికి మీ నుంచి నూరు వచ్చా యన్న మాట !

7. ముంగండ రామచంద్రరావు, లక్కవరం

దయయుంచి ఆర్టిస్టులు "శంకర్", "చిత్ర", ఎడిటర్ "చక్రపాణి" అసలు పూర్తి పేర్లు తెలుపుతారా ?

కె. సి. శివశంకరన్, టి. వి. రామవన్, ఆలూరు వెంకటసుబ్బారావు.

8. వి. నారాయణరావు, బరంపురం

కథలు, ప్రశ్నలు, ఫోటో వ్యాఖ్యలు, ఇంకా ఇతర శీర్షికలు పంపించాలని ఉంది. ఎవరికి ఎడ్రస్ చేసి పంపించాలో తెలియటం లేదు.

ఎడిటర్, "చందమామ", 2, 3 ఆర్కాటు రోడ్డు, వడపళని, మద్రాసు 26.

9. కె. రామకృష్ణ, విశాఖపట్నం

"భారత చరిత్ర"లో బొమ్మలు బదులు రాజ్యాల మ్యాపులు వేస్తే మరింత శిక్షాప్రద మవుతుందంటాను.

ఒకే మ్యాపు "చందమామ" అన్ని భాషలకూ ఉపయోగపడేలాగ చెయ్యటం కష్టం.

10. వి. రామమోహన్, చిన్నమండెం

చందమామా ! నీ పుస్తకములో వార్తలు - విశేషాలు, చిత్ర కథలు వుండిన యెంత బాగుండును ! అటువంటివి ఎందుకు ప్రచురించ లేదు.

కాగితం కొరతవల్ల అనేక చిల్లర శీర్షికలు ఎత్తివేయవలసి వచ్చింది.

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆశ్చర్యంతో

పంపినవారు:
పి. లక్ష్మి, రాజమండ్రి - 3

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఉక్కిరిబిక్కిరి

పంపినవారు:
పి. లక్ష్మి, రాజమండ్రి - 3

# నిజమైన చదువు ★ [రామతీర్థ కథ]

ఒక గురువు దగ్గిర అనేకమంది విద్యార్థులు చదువుకుంటూ ఉండేవారు. వారిలో ఒక రాజకుమారుడు కూడా ఉండేవాడు.

ఒకనాడు గురువుగారు పిల్లలను, "నిన్నటి పాఠం అందరికీ వచ్చిందా?" అని అడిగాడు. అందరూ వచ్చిందన్నారు. రాజకుమారు డేమీ మాట్లాడకపోవటం చూసి గురువు "నీకో?" అన్నాడు.

"నాకు మొదటి వాక్యం బాగా వచ్చింది. రెండో వాక్యం కూడా వచ్చింది—" అని ఆగిపోయాడు.

తన శిష్యుడి సోమరిపోతుతనానికి మండిపడి గురువు, "ఇదేనా నీ చదువు?" అంటూ బెత్తంతో రాజకుమారుణ్ణి ఎడాపెడా కొట్టాడు.

అంతలోనే గురువుకు తాను కొడుతున్నది మామూలు కుర్రవాణ్ణికాదని తెలిసి వచ్చింది. ఈ రాజకుమారుడు తలుచుకుంటే తనను కొరతవేయించగల డనుకునే సరికి గురువుకు దడపుట్టుకొచ్చింది. ఆ తరవాత ఆయనకు ఆశ్చర్యం కలిగింది—ఎందుకంటే, దెబ్బలు తిన్నప్పటికీ రాజకుమారుడిలో ఒక విచారంగాని, బాధగాని లేదు. అతడి ముఖం ప్రశాంతంగా ఉన్నది.

గురువు ఏం చెయ్యాలో తోచక, "ఏమిటి నీకు వచ్చిన రెండు వాక్యాలు?" అని రాజకుమారుణ్ణి అడిగాడు.

"క్రోధాన్ని నిగ్రహించాలి. ఎన్నడూ అబద్ధమాడరాదు," అని రాజకుమారుడు చెప్పాడు.

ఈ మాటలు వినగానే గురువుకు కను విప్పయింది. తాను గురువయినప్పటికీ, ఆ కుర్రవాడు నిజమైన చదువేదో తెలుసుకున్నాడు, తాను తెలుసుకోలేదు. నిజమైన చదువంటే పాఠాలు కంఠస్థం చెయ్యటం కాదు—వాటిని ఆచరణలో పెట్టటం!



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు *1963* మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఆశ్చర్యంతో

రెండవ ఫోటో : ఉక్కిరిబిక్కిరి

పంపినవారు : పెమ్మరాజు లక్ష్మి,

దానవాయ్‌పేట, రాజమండ్రి - 3

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# భారతం

భీష్ముడి వద్ద అన్ని ధర్మాలూ తెలుసుకుని కూడా ధర్మరాజు భీష్మ నిర్యాణంతో తిరిగి శోక సాగరంలో మునిగిపోయాడు. ఆయనను ధృతరాష్ట్రుడు ఓదార్చుతూ, "నూరుమంది కొడుకులను పోగొట్టుకున్న నేనూ గాంధారీ ఏడవాలి గాని, రాజ్యం సాధించుకున్న నీ కెందు కీ దుఃఖం?" అన్నాడు.

తరవాత వ్యాసుడు ధర్మరాజుతో, "నాయనా, ఎంతటి పాపులు కూడా తపస్సు చేతా, యజ్ఞాల చేతా పవిత్రు లవుతున్నారు. అందుచేత నీవు అశ్వమేధాది యాగాలు చేసి నీలో పాపం ఉంటే పోగొట్టుకో!" అని హితం చెప్పాడు.

"ఇంతమంది జ్ఞాతులను చంపి నేను యజ్ఞం చేస్తే ఎంత ఘనంగా దానాలు చెయ్యాలి? అలా చెయ్యటానికి నాకు ధనం లేదు. ఈ ఘోర యుద్ధంలో దృఢకాయులంతా పోగా ప్రజలలో బాలురూ, దీనులూ మిగిలారు. రాజపుత్రులు కష్ట దశలో ఉన్నారు. వారి నెలా యాచించను? పన్ను లెలా వెయ్యను?" అన్నాడు ధర్మరాజు.

దానికి వ్యాసుడు, "ధర్మరాజా, నీకు కావలిసినంత ధనం హిమాలయం మీద ఉన్నది. పూర్వం మరుత్తనేవాడు యజ్ఞం చేసి అంతులేని బంగారాన్ని బ్రాహ్మణులకిస్తే దాన్ని వారు హిమాలయంలో ఉంచారు. ఆ ధనం తెప్పించు," అన్నాడు.

అందుకు ధర్మరాజు సంతోషించి, దేవబ్రాహ్మణారాధన చేసి, పితృ కార్యాలు నిర్వర్తించి, ధృతరాష్ట్రుడితో సహా హస్తినాపురానికి తిరిగి వచ్చి రాజ్యం ఏల నారంభించాడు.

కృష్ణుడు అర్జునుడితో కూడా కొన్నాళ్ళు యాత్రలు జరిపి, కబుర్లతో కాలక్షేపం చేసి హస్తినాపురానికి తిరిగి వస్తూ, "అర్జునా, నేను వసుదేవుణ్ణీ, ఇతర యాదవులనూ చూసి చాలా కాలమయింది. ప్రస్తుతం నే నిక్కడ చేసేదికూడా ఏమీ లేదు. అందుచేత ద్వారకకు పోతాను. ఈ సంగతి నీవే ధర్మరాజుకు చెప్పు. ఆయన ఇష్టంలేకుండా పోవటం నాకు రుచించదు," అన్నాడు.

అర్జునుడు ధర్మరాజుతో ఈ మాట చెప్పాడు. ధర్మరాజు అందుకు సమ్మతిస్తూ, "మళ్లీ నేను చేయబోయే అశ్వమేధానికి రావాలి. మమ్మల్ని మరిచి పోవద్దు," అన్నాడు. కృష్ణుడు ధర్మరాజిస్తానన్న రత్నాలు మొదలైన కానుకలు నిరాకరించి, కుంతి దగ్గిర సెలవు పుచ్చుకుని, తన రథం మీద సుభద్రను కూచోబెట్టుకుని, సాత్యకి అర్జునుడితో సహా మరొక రథంలో వెంటరాగా ద్వారకకు బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళాక మిగిలిన వారందరూ వెనక్కు వచ్చేశారు. కృష్ణ సాత్యకులు సుభద్రతో ద్వారకకు బయలుదేరారు. దారిలో కృష్ణుడు ఉదంక మహాముని దర్శనం చేసుకున్నాడు. "కౌరవ పాండవుల మధ్య సంధి చేయ వెళ్ళావట! ఇప్పు డందరూ సుఖంగా ఉన్నారా?" అని ఉదంకు డడిగాడు. యుద్ధం జరిగి రెండు వంశాలూ నామ మాత్రంగా మిగిలాయని కృష్ణుడు ఉదంకుడికి తెలిపాడు.

**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

# విజయ నిశ్చయం....

హిమాచలమందు పోరాడే నిర్దయుడైన శత్రువును యుద్ధమందు చెండాడుటకు మన జవాన్లు శౌర్య ప్రతాపాలను ప్రదర్శిస్తున్నారు...




ఉత్తేజకమైన ఆ సంఘట లన్నిటినీ నెలనెలా 'ఆంధ్రప్రదేశ్' పత్రిక సంపూర్తిగా సంతరించి ప్రచురిస్తున్నది. అంతే కాదు, ప్రజానీకము తమ విజయ నిశ్చయాన్ని ఆచరణయోగ్యమైన విధంగా ఏమని చెబుతున్నారో కూడా వెల్లడిస్తున్నది....

సుప్రసిద్ధ రచయితల సిద్ధ హస్తాలనుండి— ఇంగ్లీషు, తెలుగు, ఉర్దూ, హిందీ భాషలందు వెలువడే ఈ పత్రికలో మన దేశరక్షణ సమస్య యొక్క అన్ని దశలను గురించిన అమూల్య వ్యాసాలు సవిస్తరంగా వివరింపబడుతున్నవి.

సంవత్సర చందా రు. 3/- డైరెక్టరు, సమాచార పౌరసంబంధాల శాఖ, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదుకు గాని, ఆయా జిల్లాల డిస్ట్రిక్టు పబ్లిక్ రిలేషన్ ఆఫీసరుకు గాని పంపి, మీ ప్రతిని తెప్పించుకోండి.

“సంక్రాంతి” సమయమున అందరికి మా శుభాకాంక్షలు



# CHAMPION

# BANIANS

చాంపియన్ నిట్టింగ్ కంపెనీ,

తపాలుపెట్టె నం. 42 :: తిరుపూరు.

తప్పక
చూడండి!





కళాప్రపూర్ణ థియేటర్స్ వారి...

# ఇరుగు పొరుగు

డైరెక్షన్: ఐ.యస్.మూర్తి





ప్రొడ్యూసర్: సి.విజయసారథి
మ్యూజిక్: మాస్టర్ వేణు




REVATHI




భూగోళ శాస్త్రమే వేడుక అవుతుంది!




VIEW-MASTER



వస్తోంది!

పద్మిని పిక్చర్సు వారి

# పెంపుడు కూతురు

నిర్మాత - దర్శకుడు :
బి. ఆర్. పంతులు

ఎన్.టి. రామారావు
హరనాథ్‌రాజు • రేలంగి
రమణారెడ్డి • బాలకృష్ణ • లంకాసత్యం
షావుకారు జానకి • దేవిక
మాలతి • రమాదేవి • అరుణశ్రీ



మాటలు : డి.వి. నరసరాజు
పాటలు: సి.నారాయణరెడ్డి • కొసరాజు • అనిసెట్టి
కెమెరా : వి. రామమూర్తి
సంగీతం : టి.జి. లింగప్ప

విజయ రిలీజ్...

G.H.RAO

VANAJA

